# ఆ దేవుడు ఎవరు?










భగవంతుడిని తెలుసుకోవటానికి సరైన మార్గం

వేదాలు, ఖుర్ఆన్ గ్రంథాలతో వెతికిన ఋజు మార్గం

మేధోపరమైన, సాక్ష్యాధారమైన, వాస్తవికమైన మార్గం



"వసుధైవ కుటుంబకమ్॥"

"ప్రపంచం మొత్తం ఒకే కుటుంబం."

- మహా ఉపనిషత్తు 6 : 72



ఖుర్ఆన్ 51 : 56 - 58 లో అల్లాహ్ (సృష్టికర్త) ఇలా అంటున్నారు

"నేను జిన్నుల్ని, మానవుల్ని సృష్టించినది కేవలం నన్ను ఆరాధించటానికే. నేను వారి నుండి ఉపాధి కోరడంలేదు. నాకు అన్నం పెట్టమని అడగడం లేదు. దేవుడే అందరి ఉపాధిప్రదాత. ఆయన మహా బలశాలి, అద్భుత శక్తిసంపన్నుడు."




ISLAM INFORMATION PEACE CENTER, KHAMMAM

ఇస్లాం సమాచార శాంతి కేంద్రం, ఖమ్మం

truepurposeoflife.org

 

*ఛాందోగ్య ఉపనిషత్తు 6 : 2 : 1*

*“ఏకం యెవద్వితీయం”*

“దేవుడు ఒక్కడే, రెండవ వాడు లేడు”




# హిందూ గ్రంథాలలో



# ఇస్లాం

## సృష్టికర్త = 1

## బ్రహ్మ = అల్లాహ్



## కల్కి అవతారం = ముహమ్మద్ (అ)

*ప్రవక్తల పేర్ల పక్కన (అ) అంటే "అతనికి శాంతి కలుగు గాక" అని అర్థం.*

# ముందుమాట

ఆ దేవుడు ఎవరు ? బ్రహ్మ అల్లాహ్ ఎలా అవుతాడు ? కల్కి అవతారం నిజంగా ముహమ్మద్ (అ) ?

ఈ పుస్తకంతో వీటన్నిటికీ సమాధానాలు తెలుసుకుంటారు. ఇందులో ముందుగా హిందూ మతం మరియు ఇస్లాంలో దేవుడు, అతని గుణగణాల గురించి మాట్లాడుతాము. తర్వాత దేవుడు పంపిన మనుషుల గురించి, ఆఖరి కల్కి అవతారమైన ముహమ్మద్ (అ) వారి గురించి వివరిస్తాం. తర్వాత చివరి దైవ గ్రంథం ఖుర్ఆన్ అద్భుతాలు చెబుతాం. ఇస్లాం పై కొన్ని అపోహలను తొలగిస్తాం.

భూమి పైన మన జీవితం కేవలం ఒక **70 - 100** సంవత్సరాలు మాత్రమే. కానీ తర్వాత వచ్చే మరణానంతర జీవితం శాశ్వతమైనది. కాబట్టి చివరి వరకు చదివి సొంతగా ఆలోచించమని విన్నపం.

---

## మానవులంతా ఒకే కుటుంబం



- ***మహా ఉపనిషత్తు 6 : 72*** లో ఇలా

***"అయం బంధురయంనేతి గణనా లఘుచేతసామ్***

***ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్ ॥"***

అంటే "ఈ వ్యక్తి నా వారు, ఆ వ్యక్తి కాదు" అనే భేదం సంకుచిత మనస్తత్వం (అజ్ఞానుల) ద్వారా మాత్రమే చేయబడుతుంది. శ్రేష్ఠమైన ప్రవర్తన కలిగిన వారికి (అంటే పరమ సత్యాన్ని తెలిసిన వారికి) **ప్రపంచం మొత్తం ఒకే కుటుంబం**."

- ***ఖుర్ఆన్ 49 : 13*** లో దేవుడు (అల్లాహ్) ఇలా అంటున్నారు

"ఓ మానవులారా ! మేము మిమ్మల్ని ఒకే స్త్రీ పురుష జంట (ఆదాము, హవా) నుండి పుట్టించాం."

- ***మహా భవిష్య పురాణం 4 : 10 - 20*** లో ఇలా

***"ఆదమో నామ పురుషః పత్ని హవ్యవతి తదా"***

అంటే ఆదాము పేరు గల పురుషుడు, ఆయని భార్య హవ్వ.

- ***మహాభారతం 1 : అది పర్వ : సంభవ పర్వ : LXXV*** లో ఇలా

"**మను** వంశంలో మానవులందరూ జన్మించారు, కాబట్టి వారిని '**మానవులు**' అని పిలుస్తారు."

కాబట్టి, ముస్లింలు అయినా, హిందువులు అయినా, అమెరికన్లు అయినా, అరబ్బీలు అయినా, భారతీయులు అయినా **మానవులంతా ఒకే జంట సంతానం,** పరస్పర సోదరులు, **రక్త సంబంధీకులు** అని గ్రంథాలు స్పష్టం చేస్తున్నాయి. ఇది తెలిసిన హిందువులు ముస్లిములు ఒకరినొకరిని వేరు వేరుగా కాకుండా, **ఒకరినొకరిని సహోదరులలాగా ప్రేమతో** చూస్తారు.

**అస్సలాము అలైకుమ్ ( మీకు శాంతి కలుగుగాక )**

అపార కరుణామయుడు, అపార కృపాసాగరుడయిన దేవుని పేరుతో ప్రారంభిస్తున్నాను.



**ఉద్దేశ్యం :** ఇది హిందూ మతం మరియు ఇస్లాం ని **గ్రంథాల వెలుగులో** అర్ధంచేసుకునే ప్రయత్నం. ఈ రెండిట్లో ఉన్న పోలికలు మరియు విబేధాలను వివరించి **దూరాన్ని దగ్గర చేయటం.**

*గమనిక : ప్రవక్తల పేర్ల పక్కన (అ) అంటే "అతనికి శాంతి కలుగు గాక" అని అర్థం.*

# విషయ సూచిక

 హిందూ మతం & ఇస్లాం 

అన్ని మతాల అనుచరులు వారి విశ్వాసాలను వివిధ విభాగాలుగా విభజించుకున్నారు. కాబట్టి, ఒక మతాన్ని అర్థం చేసుకోవాలి అంటే అనుచరులని చూడకుండా పవిత్ర గ్రంథాలని చదవాలి.

**హిందూ మతం**లో గ్రంథాలు **2** రకాలు. ఇవి **శృతి** (దేవుడి నుంచి విన్నవి) అనగా **4** వేదాలు, **108** ఉపనిషత్తులు మరియు **స్మృతి** (గుర్తుపెట్టుకున్నవి) అనగా **18** పురాణాలు, ఇతిహాసాలలో రామాయణం, మహాభారతం (భగవద్గీత) మొదలైనవి. శృతి గ్రంథాలైన వేదాలు, ఉపనిషత్తులు హిందూ గ్రంథాలలో అత్యంత ప్రామాణికమైనవి. ఇవి **4000** సంవత్సరాల పురాతనమై ఉండొచ్చని అంచనా. 'హిందూ' అనే పదం ~ **1300 CE** నుండి మాత్రమే వాడబడినందున పండితులు ప్రకారం హిందూమతాన్ని **'సనాతన ధర్మం'** అంటే శాశ్వతమైన మతం లేదా **'వేద మతం'** అని పిలవాలి.

**ఇస్లాం**లో ముఖ్య ఆధారం **ఖుర్ఆన్** (దేవుని మాట), **సున్నాహ్** (ప్రవక్త మాట, పద్ధతులు). దేవుడు అతని చివరి ప్రవక్తకి దేవదూత గాబ్రియేల్ ద్వారా **610 CE - 632 CE** లో అవతరింపజేసిన గ్రంథం **ఖుర్ఆన్**. ఇది **1400** సం" గా పూర్తిగా భద్రపరచబడి, ఒక్క తప్పు కూడా లేని ఏకైక దైవ గ్రంథం.

- అరబ్బీలో దైవానికి వాడే పదం **'అల్లాహ్'** అంటే **"ఆయన ఒక్కడే ఆరాధనలకు అర్హుడు"** అని.
- ఆ దైవం ఒక్కడే. జనన మరణాలు లేని ఆయన ఊహలకి అతీతుడు, ఎవరి అక్కరా లేనివాడు.
- **'ఇస్లాం'** అంటే "ఆ దైవానికి మన సంకల్పాన్ని సమర్పించి తద్వారా శాంతిని పొందటం".
- **'ముస్లిం'** అంటే "తన సంకల్పాన్ని దైవానికి సమర్పించి శాంతి పొందిన దైవ విధేయుడు".
- **'ప్రవక్త'** అంటే "సందేశం అందజేయడానికి అల్లాహ్ ఎంచుకున్న ఒక మనిషి" అని అర్థం.

అల్లాహ్ ఇప్పటిదాకా అన్ని కాలాలలో అన్ని సమాజాలకి పంపిన **1,24,000** ప్రవక్తలలో **ముహమ్మద్** (అ) **చివరి ప్రవక్త.** అతనికిచ్చిన **ఖుర్ఆన్** సమస్త **మానవాళి మార్గదర్శకం** కోసం అందజేయబడిన **చివరి దైవ గ్రంథం.** ఖుర్ఆన్ గ్రంథం > **1400** సంవత్సరాల పురాతనమైనది కానీ ఇస్లాం కొత్త ధర్మము కాదు. ఆ ఏకేశ్వరుడు (అల్లాహ్) ఆది నుండి తన ప్రవక్తల ద్వారా "దేవుడు ఒక్కడే" అని మానవాళికి భోదించిన ఆ **సనాతన ధర్మమే – ఇస్లాం** (ఏకేశ్వరునికి సమర్పణ, విధేయత).

---

## దేవుళ్ళు ఎంత మంది?

○ **3** ○ **33** ○ **100** ○ **33,00,00,000** ☑ **1**

సామాన్యంగా ఒక హిందువు ఎన్ని దేవుళ్ళని నమ్ముతారు? కొందరు మూడు పేర్లు చెబుతారు, ఇంకొందరు పది, వంద, వెయ్యి, **33** కోట్లు అని కూడా అంటారు. కానీ **గ్రంథ జ్ఞానం ఉన్న వేద పండితుడిని అడిగితే "దేవుడు ఒక్కడే"** అని చెబుతాడు. అలాగే ఒక ముస్లిం కూడా దేవుడు ఒక్కడే అని

చెబుతాడు. కానీ తేడా ఏంటంటే, సాధారణ హిందువు 'సర్వం దైవమయం' అనే తత్వాన్ని నమ్ముతాడు. చెట్టూ దైవమే, సూర్యుడు, చంద్రుడూ, మనిషీ, పామూ, ప్రతీది దైవమే! కానీ **ముస్లిముల** విశ్వాసమేమిటంటే **సృష్టిలో ప్రతీది దైవానిదే!** చెట్లు, సూర్యుడు, చంద్రుడు, మనుషులు, పాములు అన్నీ దైవానివే, దైవం సృష్టించినవే అని. ఈ చిన్న భేదాన్ని తొలగించుకోగలిగితే **హిందూ ముస్లిములంతా ఏకం కావచ్చు.** ఆ దైవం గురించి ధర్మ గ్రంథాలు ఏం చెబుతున్నాయో చూద్దాం :

దానికి ముందుగా *ఖుర్ఆన్ 3 : 64* వాక్యాన్ని అనుసరించాలి : *"ఓ గ్రంథవహులారా! మాలోనూ, మీ లోనూ సమానంగా ఉన్న ఒక విషయం వైపుకు రండి. అదేమంటే మనం అల్లాహ్‌ను తప్ప వేరెవరినీ ఆరాధించకూడదు, ఆయనకు భాగస్వాములుగా ఎవరినీ కల్పించరాదు. అల్లాహ్‌ను వదలి మనలో ఎవరూ ఇంకొకరిని ప్రభువులుగా చేసుకోరాదు."*

- ***ఋగ్వేదం 6 : 45 : 16*** లో ఏమని ఉందంటే

***"యఏక ఇత్తము స్తుహి"***

దైవం **ఒక్కడు**. ఆయన్నే ఆరాదించండి.

- ***ఛాందోగ్య ఉపనిషత్తు 6 : 2 : 1*** ఏమని చెప్తుందంటే

***"ఏకం యెవద్వితీయం"***

దేవుడు **ఒక్కడే**, రెండవ వాడు లేడు.

- ***భగవద్గీత 7 : 17*** ఏమని చెప్తుందంటే

***"ఏకభక్తిరవిశిష్యతే"***

**ఒక్క** దేవుడి యందే భక్తి గలవాడు జ్ఞాని, శ్రేష్ఠుడు అవుచున్నాడు.

- ***బ్రహ్మ సూత్రం*** ఏమిటంటే

***"ఏకం బ్రహ్మ ద్వితీయే నాస్తి నే న నాస్తి కించన్"***

దేవుడు (**సృష్టికర్త**) **ఒక్కడే**, రెండవ వాడు లేడు అసలు లేనే లేడు.

- ***ఖుర్ఆన్ 112 : 1*** లో అదే సందేశం ఇలా

***"ఖుల్హు వల్లాహు అహద్"***

ఆ దేవుడు **ఒక్కడే** (అయన అద్వితీయుడు).

**ఔను!** మీరు చదివింది **నిజమే!** బయట ఆలోచనతో పోలిస్తే ఇది కొత్తగానే అనిపిస్తుంది. కానీ ఇది వాస్తవం. ఈ గ్రంథ శ్లోకాల వెలుగులో మనం ఒక నిర్ణయానికి రావొచ్చు మనల్ని, విశ్వాన్ని సృష్టించిన దేవుడు (సృష్టికర్త) మాత్రం ఒక్కడే అని. **నిజాన్ని తెలుసుకోవాలంటే, దైవ గ్రంథాలు తప్ప మనకి మరో మార్గం లేదు. అదే ఋజుమార్గం. అదే (సాఫల్యానికి) సరైన మార్గం.**

# మరి ఆ సృష్టికర్త ఎలా ఉంటాడు?



○ మనిషిలాగా ☑ మానవ ఊహకు మించినట్టుగా

"దేవుడు" అనే పదం వినగానే మన ఊహకు మనిషి, ఇతర ప్రాణులను పోల్చే ఎన్నో చిత్రాలు కనిపిస్తాయి. కానీ, నమ్మకాలని ఊహలని పక్కన పెట్టి వాస్తవానికి గ్రంథాలలో ఏముందో చూద్దామా !

- *యజుర్వేదం 32 : 3 , శ్వేతాశ్వతర ఉపనిషత్తు 4 : 19* ఎం చెబుతున్నాయంటే

***"న తస్య ప్రతిమ అస్తి"***

ఆయనకు ఎలాంటి ప్రతిమ, ప్రతి రూపము లేదు. చిత్రాలు, ఫోటోలు, విగ్రహాలు, పోలిక ఏమీ లేదు.

- *యజుర్వేదం 40 : 8* లో ఏమని ఉందంటే

***"శుద్ధమా పోప్విధం"***

అతను శరీరం లేనివాడు మరియు పరిశుద్ధుడు.

- *ఖుర్ఆన్ 42 : 11* లో ఇలా

***"లైస కమిస్లీహీ షై"***

ఆయనను పోలినది ఏదీ లేదు.

వీటిని బట్టి ఒక్కటి మాత్రం గ్రహించగలుగుతాం. దేవుడ్ని పోలినది సృష్టిలో ఏదీ లేదు. ఊహలకి దేవుడి చిత్రాలుగా వచ్చేవి మన కల్పనలు మాత్రమే. **దేవుడు మన ఊహలకి అతీతుడు.**

---

# ఎవరిమీదైనా ఆధారపడతాడా?



- *నిరుక్త శబ్దార్థం 8 : 16* లో ఇలా ఉంది

***"అథవయో దీవ్యతి క్రీడతి సదేవాః, యశ్చారచరన్ జగద్యోథా యథ సదేవః"***

ఈ సమస్త జగత్తును **ఎవరి సహాయం లేకుండా** నిర్మించు వాడినే దేవుడు (సృష్టికర్త) అని అంటారు.

అంటే సృష్టికర్తకి ఎవరి సహాయం అవసరం లేదు. దేనిమీదా ఆధారపడడు. ఆకలిదప్పులు, నిద్ర, అలసట లాంటి **బలహీన అవసరాలు ఉండవు.** సృష్టి అంతా సృష్టికర్తపై ఆధారపడి ఉంటుంది.

---

# దైవానికి పుట్టుక, చావు ఉందా?



○ ఉంది ☑ లేదు

మన సమాజంలో దేవుళ్ళు అని అనుకునేవారు చాలా మంది పుట్టారు చనిపోయారు. కానీ ఒక్క క్షణం మన మేధస్సుతో ఆలోచిస్తే ఆ దేవుళ్ళు పుట్టక ముందు విశ్వాన్ని ఎవరు నడిపించుంటారు?

- ***శ్వేతాశ్వతర ఉపనిషత్తు 6 : 9*** ఇలా అంటుంది

***"న తస్య కశ్చిత్ పతిరస్తి లోకే న చేశితా నైవచ తస్య లింగం !***

***న కారణం కరణాది పాధిపో న చస్య కశ్చిత్ జనిత న చాదిపః"***

అంటే "సర్వశక్తి సంపన్నుడు అయిన **దైవానికి తల్లిదండ్రులు లేరు**. ఆయనకు ప్రభువు లేడు. (ఆయనే ప్రభువు). ఆయనకు గురువు లేడు. ఆయనకు పోలిక లేదు. ఆయనే మూలం. ఆయనకు సంరక్షకుడు లేడు. (ఆయనకంటే ఉన్నతుడెవరూ లేరు. ఆయన పై అధిపతులు, యజమానులు లేరు) ."

- ***భగవద్గీత 10 : 3*** లో ఇలా చెప్తుంది

"**పుట్టుక మొదలు లేని వాడుగానూ,** లోకాలకు ప్రభువుగాను నన్ను తెలుసుకున్న వాడు **మనుష్యులలో జ్ఞాని** అయ్యి అన్నీ పాపాలనుండి విముక్తి చెందుతాడు."

- ***భగవద్గీత 8 : 20*** లో ఇలా చెప్తుంది

"ప్రాణులన్నీ నశించినా అయిన భావం నశించకుండా ఉంటుంది."

- అదే సందేశం ***ఖుర్ఆన్ 112 : 3*** లో ఇలా చెప్పబడింది

***"లమ్యా లిద్ వ లంయూలద్"***

ఆయనకు సంతానం లేదు. ఆయన కూడా ఎవరికీ సంతానం కాదు.

కాబట్టి వాస్తవం ఏమిటంటే సృష్టికర్తకి పుట్టుక చావు లేదు. తల్లిదండ్రులు, భార్యా పిల్లలు లాంటి మానవ సంబంధాలు దేవునికి వర్తించవు. కాలాన్నే సృష్టించిన అయన ఏ కాలంలో జన్మించలేదు. **దేవుడు పుట్టించే వాడే కానీ, పుట్టిన వాడు కాదు. మరణాన్ని ఇస్తాడు కానీ, మరణించడు.**

---

కాబట్టి, **గ్రంథాల వెలుగులో** సర్వశక్తిమంతుడైన దైవం గురించి మనం **అంగీకరించవల్సినవి :**



1. **సృష్టికర్త ఒక్కడే ఏకైక అద్వితీయ దేవుడు.**

2. **ఆయన ఎవరి అవసరమూ లేనివాడు. నిరపేక్షాపరుడు.**

3. **ఆయన్ని దేనితో పోల్చలేము. రూపాన్ని ఊహించుకోలేము.**

4. **ఆయనకు సాటి సమానమైన వారెవరూ లేరు.**

5. **ఆయనకి పుట్టుక, మరణం లేదు. సంతానం లేదు. ఎవరికీ సంతానం కాదు.**



# విగ్రహాలు, పంచభూతాలు

మనం ఇప్పటిదాకా చూసినట్టు విగ్రహారాధనకి ఎలాంటి వేద గ్రంథాల సాక్ష్యం లేదు. **రాతితో విగ్రహం చెక్కి గుడికట్టే విధానము శాస్త్రానికి విరుద్ధం.** ఎందుకంటే సృష్టికర్త చెట్టులో, రాతిలో, మట్టిలో లేడు. దీనినే నిషేధిస్తూ, వ్యతిరేకిస్తూ, **నరక శిక్ష** గురించి హెచ్చరిస్తూ గ్రంథాలలో ఇలా ఉంది.

- ***యజుర్వేదం 40 : 9*** లో చాలా స్పష్టంగా ఇలా





***"ఆంధః తమ ప్రవిశ్యంతి యే ఆసంభూతి ముపాసతే***

***తతో భూయ యివతే తమోయో ఊ సంభూత్యాగరతః"***

***"ఆసంభూతి"*** అంటే గాలి, నీరు, నిప్పులాంటి సహజ **ప్రకృతి** అంశాలని ఆరాధించే వ్యక్తులు అంధకారంలోకి ప్రవేసిస్తున్నారు' అంటే **నరకంలోకి** ప్రవేశిస్తారు.

***"సంభూతి"*** అంటే వస్తువులు, బొమ్మలు, **విగ్రహాలను** ఎవరైతే ఆరాధిస్తారో వారు మరింత గాఢాంధకారంలోకి అంటే **మరింత నరకంలోకి** ప్రవేశిస్తారు.



- ***భగవద్గీత 7 : 20*** లో ఇలా చెప్తుంది



**"ఇహలోక వాంచ్ఛల్లో మునిగిన వారి జ్ఞానం హరించుకు పోయి,**

**వాళ్ళు మిధ్యా (తప్పుడు) దేవతలను ఆరాధిస్తారు."**

అంటే ప్రాపంచిక వాంఛలకు లోబడిన వారు విగ్రహారాధన, తప్పుడు దేవతల పూజలు చేస్తారు.

- ***ఈశావాస్యోపనిషత్ 13*** లో ఇలా

"**ప్రకృతిని** ఆరాధిస్తే ఒక లాభం అని, **విగ్రహాలను** ఆరాదిస్తే మరొక లాభం అని, మా పెద్దలు చెప్తుండగా మేము విన్నామని" వారు అంటారు. వాస్తవంగా ఇది **దేవుడు చెప్పలేదు."**

**ఇస్లాంలో** అతి ఘోరమైన పాపం, **ఒకే ఒక్క క్షమించరాని పాపం బహుదేవతారాధన.** దైవాన్ని కాదని వేరే వాళ్లని ఆరాదించుట. అరబ్బీలో దీన్ని **'షిర్క్'** అంటారు.

- అదే ***ఖుర్ఆన్ 4 : 116*** లో ఇలా

"అల్లాహ్ (సృష్టికర్త) తనకు సాటి కల్పించడాన్ని (**షిర్క్**) ఎట్టి పరిస్థితిలోనూ **క్షమించడు.** అదితప్ప మరే పాపాన్నయినా తానుతలచుకుంటే క్షమిస్తాడు."

- ***ఖుర్ఆన్ 2 : 21*** లో ఇలా

**"మానవులారా ! మిమ్మల్ని, మీ పూర్వీకుల్ని సృష్టించిన మీ ప్రభువు (అల్లాహ్) ను ఆరాధించండి** – తద్వార మీరు (**నరకాగ్ని** నుండి) రక్షించబడే అవకాశం ఉంది."

*** కాబట్టి బహుదేవతారాధన, విగ్రహారాధన చేసేవారు నరకానికి వెళతారు !**

# బ్రహ్మ = విష్ణు = అల్లాహ్



ఈరోజు అల్లాహ్ అంటే మా దేవుడు అని **ముస్లింలు భ్రమ** పడుతున్నారు. అల్లాహ్ అంటే ముస్లింల దేవుడు అని **హిందువుల అపోహలో** ఉన్నారు. అరబ్బీలో దేవునికి ఉపయోగించే పేరు **'అల్లాహ్'** అంటే "ఆయన ఒక్కడే ఆరాధనలకు అర్హుడు" అని అర్థం. అల్లాహ్ పేరు యొక్క **ప్రేత్యేకత** ఏంటంటే (దేవుళ్ళు, దేవత లాగా) స్త్రీ లింగం, పురుష లింగం, బహువచనలు లేవు.



- ***ఋగ్వేదం 8 : 1 : 1*** లో అల్లాహ్

"ఆయన ఒక్కరినే స్తోత్రం చేయండి, ఆయనే ఆరాధనలకు అర్హుడు".

**"ఆయన ఒక్కడే ఆరాధనలకు అర్హుడు"** అనేదే అరబ్బీ భాషలో **'అల్లాహ్'.**

- ***ఋగ్వేదం 1 : 164 : 46*** లో దైవం పేర్ల గురించి ఇలా చెప్పబడింది

***"ఏకం సద్ విప్రా బహుదా వదంతే"***

"సత్యం ఒక్కటే ! దైవం ఒక్కడే ! ఋషులు ఆయన్ని వివిధ పేర్లతో పిలుస్తారు."

- ***ఖుర్ఆన్ 17 : 110*** లో ఇలా

" **'అల్లాహ్'** అని పిలిచినా, **'రెహమాన్'** (**కరుణామయుడు**) అని పిలిచినా, ఏ పేరుతో పిలిచినా అత్యుత్తమమైన పేర్లన్నీ ఆయనవే."



- ***ఋగ్వేదం 2 : 1*** లో దేవుడికి 33 వివిధ పేర్లు ప్రస్తావించబడ్డాయి. వాటిలో ఒకటి **'బ్రహ్మ'.**

**'బ్రహ్మ'** అంటే **'సృష్టికర్త'** అని అర్థం. అరబ్బీలో **'ఖాలిఖ్'** అని అర్థం. ఆ దేవుణ్ణి ఖాలిఖ్ అన్నా, సృష్టికర్త అన్నా, బ్రహ్మ అన్నా అభ్యంతరము లేదు. **కానీ** దైవం అంటే బ్రహ్మ అని, ఆయనకు నాలుగు తలలున్నాయనీ, ప్రతి తలమీదా కిరీటం ఉంటుందనీ అనడం, **వర్ణించడం మాత్రం పొరబాటు.**

*ఎందుకంటే "**దైవానికి ఎటువంటి ప్రతిమ, ప్రతిరూపం లేదు**" అని **యజుర్వేదం** (32 : 3) చెప్తుంది.*

- ***ఋగ్వేదం 2 : 1 : 3*** లో దైవానికి మరో పేరును **'విష్ణు'** గా ప్రస్తావించడం జరిగింది.

**'విష్ణు'** అంటే **'నడిపించే వాడు'** అని అర్థం. అరబ్బీలో **'రబ్'** అంటారు. ఆయనను రబ్ అన్నా, విష్ణు అన్నా, నడిపించే వాడు అన్నా అభ్యంతరము లేదు. **కానీ** దైవం అంటే విష్ణు అని, ఆయన పాముతల పై పడుకుంటాడని, సముద్రంలో నిదురిస్తాడని, గాలిలో గరుడ పక్షి పై ప్రయాణిస్తాడని ఆయనకు నాలుగు చేతులనీ, ఒక చేతిలో విష్ణుచక్రం, మరో చేతిలో శంఖం ఉంటాయని **వర్ణిస్తే మాత్రం పొరపాటవుతుంది.**

# భగవంతుడి గుణగణాలు

ఇందాక చూసినట్టు ఆ ఒక్క దేవుడికే వివిధ పేర్లు ఉన్నాయి. **ఇవన్నీ ఆ ఒక్క దేవుని గుణగణాలు కానీ ఒక్కో పేరు ఒక్క వేరే దేవుడు కాదు.** అంతిమ దైవ గ్రంథం ఖుర్ఆన్‌లో అల్లాహ్ (సృష్టికర్త) **99** పేర్లతో తన దైవ గుణగణాలను వివరించారు.

- అదే ***ఋగ్వేదం 10 : 114 : 5*** లో ఇలా

"దేవుడు ఒక్కడే ! ఋషులు ఆయన్ని పలు పేర్లతో స్తుతిస్తారు"

99

- ***ఖుర్ఆన్ 59 : 24*** లో ఇలా

"ఆయనే అల్లాహ్ – సృష్టికర్త, ఉనికిలోనికి తెచ్చేవాడు, రూపకర్త; అత్యుత్తమ పేర్లన్నీ ఆయనకే చెందుతాయి. భూమి ఆకాశాల లోని ప్రతీ అణువణువూ ఆయన పవిత్రతను కీర్తిస్తోంది."

*సంస్కృతంలో, అరబ్బీలో అల్లాహ్ యొక్క కొన్ని పేర్లు మరియు వాటి అర్థాలు :*

| సంస్కృతంలో పేరు | అరబ్బీలో పేరు | తెలుగులో అర్థం |
|---|---|---|
| బ్రహ్మ | అల్- ఖాలిఖ్ | సృష్టికర్త |
| విష్ణు | రబ్ | సంరక్షకుడు |
| శివుడు | ఆల్-ముమీత్ | వినాశకుడు |
| యమ | ఆల్-ముమీత్ | మరణాన్ని ఇచ్చేవాడు |
| ముకుంద | అల్'ముసవ్విర్ | తీర్చిదిద్దేవాడు |
| పరమాత్మ | ఆల్-ముతకబ్బిర్ | అత్యున్నతమైన |
| జనార్ధన | ఆల్-ముంతఖిమ్ | శత్రువులను శిక్షించేవాడు |
| మహావీర | అల్-అజీజ్ | శక్తివంతమైన, సాటిలేని |
| పవిత్రం | ఆల్-క్కుద్దూస్ | స్వచ్ఛమైన |
| ఏక | ఆల్-ఆహద్ | ఒక్కడు |
| అచ్యుత | అస్-సలాం | ఏ రకమైన లోపం లేనివాడు |
| పాపనాష్ | ఆల్-అఫ్పువ్ | పాపాలను తొలగించేవాడు |
| దయాధార | అర్-రహ్మాన్ | అపార కరుణామయుడు |
| కృపాధార | ఆర్-రహీమ్ | అపార దయగలవాడు |

## బ్రహ్మ, విష్ణు, మహేశ్వర = ఒక్కడే దేవుడు కానీ త్రిమూర్తులు కాదు !

సృష్టించటం, సంరక్షించటం, అంతంచేయటం అన్నీ సృష్టికర్త అల్లాహ్ ఒక్కడే చేయగలడు.

# మరి ఆ దేవుడు అవతరించడా?



- ***యజుర్వేదం 40 : 8*** ప్రకారం

  ఆ దేవుడు ఎప్పటికీ **శరీర ధారణ చేయడు** (మానవ అవతారం ధరించడు).

- ***భగవద్గీత 7 : 24*** లో ఇలా చెప్తుంది

  "నేను శాశ్వతుడను, సర్వోత్తముడను, ఇంద్రియములకును, మనస్సునకును కనపడనివాడను. నా పరాభవమును **బుద్ధిహీనులు గ్రహింపక**, ఇట్టి నన్ను **సాధారణ మనుష్యునిగా** తలంచుచున్నారు."

అంటే బ్రహ్మ (సృష్టికర్త) మానవ అవతారాలు తీసుకుంటారని అజ్ఞానులు నమ్ముతారు.

**అవతారాల** గురించి అత్యంత పవిత్రమైన గ్రంథాలైన **వేదాలలో ఎక్కడా లేదు.** కానీ ! దీని గురించి పురాణాలూ మరియు ఇతిహాసాలలో ఉంది. '***అవతారం***' అంటే అర్థం "క్రిందికి దిగిరావటం". కొంతమంది పండితులు దీని అర్థం **"దేవునితో ప్రత్యేక సంబంధం ఉన్న వ్యక్తి రావడం"** అని చెప్తారు. వేదాలు మరియు ఇతర గ్రంథాల మధ్య వైరుధ్యం ఉంటే, అత్యంత అధికారిక వేదాలే గెలుస్తాయి.

కాబట్టి ఈ విధంగా మనం భగవద్గీత, పురాణాలను వేదాలతో పునరుద్ధరించవలసి వస్తే, మనం అంగీకరించాల్సిన విషయం ఏమిటంటే **"అవతారాలు"** అని వాడినప్పుడు అవి "**దేవుడు ఎంపిక చేసుకున్న వ్యక్తులను**" సూచిస్తాయి.

**ఇస్లాంలో** వీళ్ళనే 'ప్రవక్తలు' అంటారు. '**ప్రవక్త**' అంటే **"దైవం ఎంచుకున్న ఒక మనిషి"** అని అర్థం. అల్లాహ్ ఇప్పటిదాకా **1,24,000** ప్రవక్తలని అన్ని సమాజాలకి, అన్ని కాలాలలో పంపారు.

- ***ఖుర్ఆన్ 16 : 36*** లో ప్రవక్తల గురించి అల్లాహ్ (సృష్టికర్త) ఇలా అంటున్నారు

  **"వాస్తవానికి మేము ప్రతి సమాజం వారి వద్దకు ఒక ప్రవక్తను పంపాము."**

- ***ఖుర్ఆన్ 35 : 24 - 25*** – **"హెచ్చరించేవాడు రాని సమాజం అంటూ ఏదీ లేదు."**

- ***ఖుర్ఆన్ 13 : 38*** లో అల్లాహ్ కొన్ని ప్రవక్తలకు గ్రంథాలు ఇచ్చి పంపారు అని ఇలా

  **"ప్రతి యుగానికి ఓ గ్రంథం ఉంది."**



ఖుర్ఆన్‌లో ప్రత్యేకంగా **25** ప్రవక్తలని, **4** దైవ గ్రంథాలని మాత్రమే పేరుతో ప్రస్తావించారు.

**హిందూ** గ్రంథాలలో దేవుని నిజమైన వర్ణన ఉంది. కానీ పండితుల ప్రకారం ఈ **గ్రంథాలు వాటి అసలు రూపంలో భద్రపరచబడలేదు.** కాలం గడిచేకొద్దీ మనుషుల జోక్యంతో, తొలగింపులు, జోడింపులు, అవకతవకల కారణంగా అనేక వైరుధ్యాలు, లోపాలు, అశాస్త్రీయమైన అంశాలు కలిగున్నాయి. *"కాలక్రమేణా **99%** వేద సాహిత్యం కోల్పోయాము"* అని ***స్వామి వివేకానంద*** గారు అన్నారు !

- కాబట్టి ఇప్పుడు, దేవుడు చివరిగా మానవాళికి పంపిన ప్రవక్త ముహమ్మద్ (అ) వారిని మరియు ఆయనకి ఇవ్వబడి పూర్తిగా భద్రపరచబడిన అంతిమ దైవ గ్రంథం ఖుర్ఆన్‌ని అనుసరించాలి.

# శ్రీ రాము, శ్రీ కృష్ణ, బాబా వారు దేవుడి గురించి ఏం చెప్తున్నారు?

గ్రంథాల దృష్టిలో వాళ్ళ వాస్తవికత ఏమిటి? వాళ్ళు మానవాళికి ఇచ్చిన సందేశం ఏమిటి?



**1.** *శ్రీ రాముల వారు రామాయణం యుద్ధకాండం 110 : 111* లో ఇలా అన్నారు

***"ఆత్మానాం మానుషం మన్యే, రామం దశరథాత్మజమ్"***

"నేను సామాన్య మానవుడ్ని. నా పేరు రాముడు. నేను దశరథ కుమారుడ్ని."

- *బాలకాండం 13 : 3* లో సుప్రభాతంతో గురువు విశ్వామిత్రుడు రాముల వారిని లేపుతూ ఇలా

***"కౌసల్యా సుప్రజా రామా ! పూర్వా సంధ్యా ప్రవర్తతే ఉత్తిష్ఠ నరశార్దూల ! కర్తవ్యం దైవమాహ్నికమ్"***

అంటే "ఓ కౌసల్యకు పుట్టినటువంటి మంచి పిల్లవాడా ! రామా ! సూర్యుడు ఉదయించే వేళవుతుంది. నిదురలే నరులలో పులివంటివాడా ! **దైవాన్ని ఆరాధించుట నీ జీవిత లక్ష్యం రామా !**"

- యుద్ధభూమిలో విల్లు ఎక్కుపెట్టే ముందు పైకి చూసి ఆ దైవాన్ని స్మరించి బాణాన్ని వదిలేవారు !

**2.** *శ్రీ కృష్ణుల వారు మహాభారతం ఉద్యోగపర్వం, త్రితీయాశ్వాసము 82 - 84* లో ఇలా

**"ఓ అర్జున !** మనం ఎన్ని కర్మలు చేసినప్పటికీ, **దేవుడు ప్రసన్నుడైతేనే** మానవ ప్రయత్నాలు సఫలమవుతాయి. నేను మాత్రం నా శక్తి కొలది సంధి సమకూర్చటానికి ప్రయత్నం చేస్తాను. **కానీ, దైవం ఏం చేయదలచాడో నేను ఎలా చెప్పగలను?"** అని అన్నారు.



- *భగవద్గీత 18 : 62* లో శ్రీ కృష్ణుల వారు ఇలా అన్నారు

***"తమేవ శరణం గచ్ఛ"***

"అన్ని విధాల **ఆ ఈశ్వరుడినే** శరణు పొందు. ఆయన అనుగ్రహంతో శాంతిని మోక్షాన్ని పొందుతావు."

**3.** **షిరిడి సాయిబాబా వారు 1830**లో జన్మించి **1918**లో మరణించారు. ఆయన ఒక **ముస్లిం !**



ఆయన మాంసాహారం తినేవారు, మసీదులో ఉండి ప్రార్థన చేసేవారు. అయన ఇలా చెప్పారు :

***"సబ్కా మాలిక్ ఏక్ హై"*** - **"అందరి దేవుడు ఒక్కడే"**

***"అల్లాహ్ మాలిక్"*** - **"అల్లాహ్ దేవుడు"**

- *సాయిబాబా ది మాస్టర్ : రచన ఎక్కిరాల భరద్వాజ పేజీ నెం : 139* లో ఇలా ఉంది

"సాయిబాబా ప్రతీరోజు సూర్యుడు ఉదయించక ముందే నిద్ర లేస్తారు, అన్నిటికంటే ముందు **నమాజ్ (ఇస్లాం ప్రార్థన) ఆచరిస్తారు."**

- *పేజీ నెం : 228* లో సాయిబాబా వారు ఇలా అన్నారని ఉంది

**"అల్లాహ్** మాత్రమే ప్రభువు మరియు యజమాని. నేను దేవుడి దాసుడ్ని మాత్రమే ! "

* **పుట్టి, మరణించి, ఆకలేస్తే తిని, ఆ నిజ దేవుడికి ప్రార్థించే మనుషులు దేవుళ్ళు కాగలరా?**

## అల్లాహ్ పంపిన ప్రవక్తల క్రమం     * ప్రవక్తలందరికి శాంతి కలుగు గాక *

- అల్లాహ్ ప్రతి యుగంలో ప్రతి సమాజానికి “దేవుడు ఒక్కడే” అనే సందేశాన్ని తన సేవకులైన ప్రవక్తలను పంపి భోదించారు.
- **ప్రతి కాలంలోని ప్రవక్తలు, వారి అనుచరులందరూ అప్పటి ముస్లింలు** (దైవానికి తమ సంకల్పాన్ని సమర్పించినవారు).
- కాని అల్లాహ్ పంపిన క్రొత్త ప్రవక్త వచ్చినప్పుడు అతడిని అనుచరించవలసి ఉంటుంది. ఉదాహరణకు : ప్రవక్త ఇస్సాకు అనుచరులు ప్రవక్త మోషేను అనుచరించారు. వీరి అనుచరులు ప్రవక్త దావీదును అనుచరించారు. వీరి అనుచరులు ప్రవక్త యేసును అనుచరించారు. కాబట్టి వీరందరూ ఈ క్రమంలోని చివరి ప్రవక్తయున ముహమ్మద్‌ను అనుసరించాలి.




## ముహమ్మద్ ( 570 CE – 632 CE )

మునుపటి ప్రవక్తలు, గ్రంథాలు అన్నీ ఒక నిర్దిష్ట కాలానికి, వారి వారి సమాజాల కోసం మాత్రమే తాత్కాలికంగా ఉద్దేశించబడ్డాయి !

ఇప్పుడు **చివరి ప్రవక్త ముహమ్మద్, ఆఖరి దైవ గ్రంథం ఖుర్‌ఆన్** కాలం చివరి వరకు **మొత్తం మానవాళి కోసం** పంపబడ్డారు.

ఖుర్‌ఆన్ గ్రంథం > 1400 సం" గా అరబ్బీ భాషలో, అసలు రూపంలో **పూర్తిగా భద్రపరచబడింది.** హిందూ గ్రంథాలలో చివరి ప్రవక్తని చివరి కల్కి అవతారంగా ప్రవచించారు. గత ప్రవక్తల అనుచరులు, మానవులంతా ఆఖరి ప్రవక్తని, ఆఖరి ధర్మశాస్త్రాన్ని అనుసరించాలి.

**సందేశం – దేవుడు ఒక్కడే.** ఏకైక అద్వితీయుడు. ఎవరి అక్కరా లేనివాడు. ఆయనకు సంతానం లేదు (బిడ్డలను కనడు) మరియు ఆయన కూడా ఎవరి సంతానమూ (ఎవరికీ జన్మించినవాడునూ) కాడు. ఆయనతో పోల్చదగినది ఏదీ లేదు.

- అల్లాహ్ పంపిన **1,24,000** ప్రవక్తలలో ప్రత్యేకంగా **25** మందిని మాత్రమే ఖుర్ఆన్ గ్రంథంలో పేరుతో ప్రస్తావించారు.

| NAMES OF PROPHETS QUR'ĀN ( BIBLE ) | అరబ్బీలో (తెలుగులో) ప్రవక్తల పేర్లు ఖుర్ఆన్ ( బైబిల్ ) | ఇచ్చిన సందేశం | పంపబడిన ప్రాంతం / ప్రజలు |
|---|---|---|---|
| 'ĀDAM ( ADAM ) | ఆదమ్ ( ఆదాము ) | దేవుడు ఒక్కడే | భూమి ( EARTH ) |
| 'IDRĪS ( ENOCH ) | ఇద్రీస్ ( హనోకు ) | దేవుడు ఒక్కడే | బబులోను ( BABYLON ) |
| NŪḤ ( **NOAH** ) | నూహ్ ( **నోవహు** ) | **దేవుడు ఒక్కడే** | **భారత దేశం?** ( ANCIENT **INDIA?** ) |
| HŪD | హూద్ | దేవుడు ఒక్కడే | ఆద్ తెగ ( ĀD TRIBE ) |
| ṢĀLIḤ | సాలెహ్ | దేవుడు ఒక్కడే | తమూద్ తెగ ( THAMUD TRIBE ) |
| 'IBRĀHĪM ( **ABRAHAM** ) | ఇబ్రాహీమ్ ( **అబ్రాహాము** ) | **దేవుడు ఒక్కడే** | ఇరాక్ ( IRAQ ) |
| LŪṬ ( LOT ) | లూత్ ( లోతు ) | దేవుడు ఒక్కడే | సొదొమా గొమొర్రా ( Sodom and Gomorrah ) |
| 'ISMĀ' ĪL ( ISHMAEL ) | ఇస్మాయీల్ ( ఇష్మాయేలు ) | దేవుడు ఒక్కడే | మక్కా ( MAKKAH / BAKKAH ) |
| 'ISḤĀQ ( ISAAC ) | ఇస్ హాఖ్ ( ఇస్సాకు ) | దేవుడు ఒక్కడే | కనాను ( CANAAN / PALESTINE ) |
| YA' QŪB ( JACOB ) | యఅఖూబ్ ( యాకోబు ) | దేవుడు ఒక్కడే | కనాను ( CANAAN / PALESTINE ) |
| YŪSUF ( JOSEPH ) | యూసుఫ్ ( యోసేపు ) | దేవుడు ఒక్కడే | ఐగుప్తు ( EGYPT ) |
| SHU' AYB | షోయెబ్ | దేవుడు ఒక్కడే | మిద్యాను ( MIDIAN ) |
| AYŪB ( JOB ) | అయ్యూబ్ ( యోబు ) | దేవుడు ఒక్కడే | ఎదోము ( EDOM ) |
| MŪSĀ ( **MOSES** ) | మూసా ( **మోషే** ) | **దేవుడు ఒక్కడే** | ఫరో ( EGYPT PHAROAH ) |
| HĀRŪN ( AARON ) | హారూన్ ( అహరోను ) | దేవుడు ఒక్కడే | ఫరో ( EGYPT PHAROAH ) |
| DHUL-KIFL ( EZEKIEL ) | జుల్ కిఫ్ల్ ( యెహెజ్కేలు ) | దేవుడు ఒక్కడే | బబులోను ( BABYLON ) |
| DĀŪD ( DAVID ) | దావూద్ ( దావీదు ) | దేవుడు ఒక్కడే | యెరూషలేము ( JERUSALEM ) |
| SULAYMĀN (SOLOMON) | సులైమాన్ ( సొలొమోను ) | దేవుడు ఒక్కడే | యెరూషలేము ( JERUSALEM ) |
| 'ILYĀS ( ELIJAH ) | ఇలియాస్ ( ఏలీయా ) | దేవుడు ఒక్కడే | ఏలీయా యొక్క ప్రజలు ( PEOPLE OF 'ILYĀS ) |
| ALYASA' ( ELISHA ) | అల్ యసా ( ఎలీషా ) | దేవుడు ఒక్కడే | ఇశ్రాయేలు పిల్లలు ( Children of Israel ) |
| YŪNUS ( JONAH ) | యూనుస్ ( యోనా ) | దేవుడు ఒక్కడే | నీనెవె ( NINEVEH ) |
| ZAKARĪYA (ZECHARIAH) | జకరియ్యా ( జెకర్యా ) | దేవుడు ఒక్కడే | యెరూషలేము ( JERUSALEM ) |
| YAḤYĀ (JOHN THE BAPTIST) | యహ్యా (బాప్తిస్మమిచ్చు యోహాను) | దేవుడు ఒక్కడే | యెరూషలేము ( JERUSALEM ) |
| ' ĪSĀ ( **JESUS** ) | ఈసా ( **యేసు** ) | **దేవుడు ఒక్కడే** | ఇశ్రాయేలు ఇంటివారు (యూదులు) ONLY TO LOST SHEEP OF ISRAEL |
| **MUḤAMMAD / AHMED** | **ముహమ్మద్ / అహ్మద్** | **దేవుడు ఒక్కడే** | * **మానవులందరికీ** * ( **TO ALL OF MANKIND** ) |

❖ క్రైస్తవులలో కేవలం పౌలు, తరవాత వచ్చిన చర్చి పెద్దలు మాత్రమే దేవుడు ముగ్గురని, ప్రవక్త యేసు దేవుడి కన్న కొడుకని, త్రిత్వంలో ఒకడు దేవుడని చెప్పారు ! **కానీ** వీరెవరూ యేసుని భూమ్మీద కలవలేదు, తన మాటలు చెవులారా విననూ లేదు !

# ప్రధాన ప్రపంచ మతాలు




*దేవుడు ఉన్నాడని నమ్మేవారిలో > 85% మంది వారి గ్రంథాల ప్రకారం **ఆ దేవుడు ఒక్కడే !***

- **హిందూ మతం** ( గ్రంథాల మొదలు ~ **2300 BCE - 1500 BCE** )

  **116** కోట్ల మంది అనుచరులు.

  మునుపటి వేద గ్రంథాల ప్రకారం **దేవుడు ఒక్కడే !** ముగ్గురు / త్రియేకుడు కాదు.

  **చివరి కల్కి అవతారంగా** చివరి దైవ ప్రవక్త ముహమ్మద్ (అ) ప్రవచించబడ్డారు.

- **క్రైస్తవ మతం** ( ప్రవక్త యేసు (అ) జననం ~ **4 CE** )

  పూర్వం

  సాధారణ శకం

  **238** కోట్ల మంది అనుచరులు. అనేక వర్గాలు. **ఒక్కో వర్గానికి వేర్వేరు బైబిల్.**

  మునుపటి బైబిల్ గ్రంథాల ప్రకారం **దేవుడు ఒక్కడే !** ముగ్గురు / త్రియేకుడు కాదు.

  అసలు బైబిల్లో త్రిత్వం (ట్రినిటీ) ఎక్కడా లేదు. ఇది 4వ శతాబ్దంలో ఐన నైసియా కౌన్సిల్ కల్పితం **!**

  ప్రవక్త యేసు (అ) తరవాత **రాబోయే ప్రవక్తగా** ముహమ్మద్ (అ) ప్రవచించబడ్డారు.

- **ఇస్లాం మతం** – **191** కోట్ల మంది ( **ఖుర్ఆన్** అవతరణ మొదలు ~ **610 CE** )

  **దేవుడు ఒక్కడే !** జనన మరణాలు లేని ఆయన, ఊహలకి అతీతుడు. ఎవరి అక్కరా లేనివాడు.

  చివరి ప్రవక్త **ముహమ్మద్** (అ) ద్వారా ఆ దేవుడు మానవాళికి ఇచ్చిన **చివరి గ్రంథం – ఖుర్ఆన్.**

  వర్గాలు ఉన్నా **ముస్లింలందరికీ ఒకే ఖుర్ఆన్.** అసలు రూపంలో **భద్రపరచబడిన ఏకైక గ్రంథం.**

  ఇస్లాం ప్రపంచంలోనే అత్యధికంగా ఆచరించే మతం, అత్యంత వేగంగా పెరుగుతున్న మతం.

# హిందూ గ్రంథాలలో ముహమ్మద్ (అ)



అష్టాదశ పురాణాల్లోని ***శ్రీ మహా భవిష్య పురాణం 3 : 3 : 3 : 5 - 7*** లో పేరుతో సహా ఇలా

***"ఏతస్మిన్నన్ తారే మళేచ్ఛా ఆచార్యేణ సమన్వితః ముహమ్మదం ఇతిక్యథా***

***శిష్య శాఖ సమన్వితా॥ రూపచ్ఛైవ మహాదేవం మరుస్థల నివాసినమ్ ॥"***

అంటే "ఒక మళేచ్ఛుడు (పరదేశీయుడు), నిరక్ష్యరాస్యుడైన ఒక భోధకుడు, తన శిష్యులతో పాటు వస్తాడు ఆయన పేరు **ముహమ్మద్. ఎడారి ప్రాంతం** నుంచి వస్తాడు."

---

- ***శ్రీ మహా భవిష్య పురాణం 3 : 3 : 3 : 10 - 28*** లో ప్రవక్త (అ) గురించి పేరుతో సహా ఇలా

***"ఓం మమదం బితుశ్రీ నామ జేయశ్యః మక్కైశ నగర జననస్యః అద్వైత వేద పరాంగస్యః***

***భూయిష్టా సేసివర్ణస్యాః చేద్రోపాశా గణాంకస్యః అహ్మద ఇథిక్యతః శిష్యశకు పరిమాన్వితః***

***సోమవతీ యేశోభూషితాః మరుస్థలీ నవసీనామ్॥ లింగచ్ఛేది శిఖాహీనః శ్మశ్రుధారి సాధుషకః***

***ఉచ్ఛలాపి సర్వభక్షీ భవిష్యతీ జనోమమ॥ వినకౌలాంఛేశవస్తేషాం భక్ష మాతామమా॥***

***ముసలై నైవసంస్కారః కుషైదీ వభవిష్యతి తస్మాన్ ముసలవన్తోహి జాతయో***

***ధర్మధూషకా ఇతిపై సత్యధర్మచ్ఛా భవిష్యతి మాయాకృతాః"***

అంటే అయన ఎలా ఉంటారంటే:

| | | |
|---|---|---|
| **మమదం బితుశ్రీ నామ** | - | **ముహమ్మద్** అనే ప్రఖ్యాత నామం కలిగిన వారు |
| **మక్కైశ** | - | మొక్కై అనగా మధ్య మాంకము, ఐశ అనగా భూమి |
| **నగర జననస్యాః** | - | భూమికి మధ్య భాగములో **మక్కా** నగరమందున జన్మిస్తారు |
| **అద్వైత వేద పరాంగస్యః** | - | ఆదేశానుసారంగా విద్య అందుతుంది |
| **భూయిష్టా సేసివర్ణస్యాః** | - | భువి మీద వారు **గోధుమ రంగు** కలిగి ఉంటారు |
| **చేద్రోపాశా గణాంకస్యః** | - | **చంద్రుడిని** చూసి నెలలు లెక్కపెడతారు |
| **అహ్మద ఇథిక్యతః** | - | **అహ్మద్** అనే ప్రఖ్యాతి గాంచుతారు |
| **శిష్యశకు పరిమాన్వితః** | - | శిష్యులను (సహాభాలను) అక్కడక్కడా ఏర్పాటు చేస్తారు |
| **సోమవతీ యేశోభూషితాః** | - | అమీన, అబ్దుల్లాహ్ కి జన్మిస్తారు |
| **మరుస్థలీ నవసీనామ్** | - | **ఎడారి** ప్రాంతంలో నివాసం ఉంటారు |
| **లింగచ్ఛేది** | - | సున్తీ చేయించుకున్న వారై, ఖత్నా చేయబడ్డ వారై ఉంటారు |
| **శిఖాహీనః** | - | తలపై ముడి (**పిలక**) **వుండదు** |
| **శ్మశ్రుధారి సాధుషకః** | - | **గడ్డం** పెంచుకొని ఉంటారు |







| | | |
|---|---|---|
| **సర్వభక్షి** | – | శాఖహారి మరియు మాంసాహారి |
| **భవిష్యతి జనోమమ** | – | ఈ విధంగా ఉండేవారు భవిష్యత్తులో జన్మించి |
| **ముసలై నైవసంస్కారః** | – | ప్రాచీన మైనటువంటి ధర్మాన్ని సంస్కరిస్తారు (**ఇస్లాం**) |

- ఇంకా ***భవిష్య పురాణం 3 : 1 : 3 : 21 - 23*** లో ఇస్లాం, ముస్లింల గురించి పేరుతో సహా ఇలా

  "**భారతదేశంలో** రక్షలు, షబర్, భిల్ మరియు ఇతర మూర్ఖులు నివసిస్తున్నారు. 'మళేచ్చల' దేశంలో 'మళేచ్చ ధర్మం' (**ఇస్లాంతో** ఉన్న) అనుచరులు తెలివైన వారు మరియు ధైర్యవంతులు. **ముసల్మాన్ లలో** అన్నీ మంచి గుణాలు కనిపిస్తాయి మరియు ఆర్యుల దేశంలో అన్ని రకాల దుర్గుణాలు పేరుకుపోయాయి. **ఇస్లాం భారతదేశం మరియు దాని ద్వీపంలో పాలిస్తుంది.**"



- ***సామవేదం 6 : 8*** లో ముహమ్మద్ (అ) మరో పేరు 'అహ్మద్' అని పేరుతో సహా ఇలా

  ***"అహమది పితుహు పరమేదా మృతస్య జాగ్రణి అహం సూర్యో ఇవాజనః"***

  అంటే "**అహ్మద్** అనే అతను తన ప్రభువు నుండి **ధర్మశాస్త్రం** (**ఖుర్ఆన్**) పొందాడు. ఆ ధర్మశాస్త్రం ఎంతో జ్ఞాన పూరితమై నటువంటిదని అర్థం."



# కల్కి అవతారం = ముహమ్మద్ (అ) !

మనం ఇప్పటిదాక నేర్చుకున్నట్టు "**అవతారం**" అంటే "**దేవుడు ఎంచుకున్న మనిషి**" అని అర్థం. '**కల్కి**' చివరి అవతారం కాబట్టి "దేవుడు పంపిన చివరి ప్రవక్త" అని అనుకోవొచ్చు.



- ***ఖుర్ఆన్ 33 : 40*** లో ముహమ్మద్ (అ) చివరి ప్రవక్త అని ఇలా

  " (ఆయన) ప్రవక్తల పరంపరను పరిసమాప్తం చేసే చివరివాడు."

- ***భాగవత పురాణం 12 : 2 : 18-20*** లో ముహమ్మద్ (అ) కల్కిగా ప్రవచించబడ్డారు

  "**శంభాల** గ్రామంలో **గ్రామ పెద్ద**, మంచి స్వభావం ఉన్న **విష్ణుయాస** ఇంట్లో **కల్కి** భగవానుడు కనిపిస్తాడు. ఎనిమిది ఆధ్యాత్మిక శక్తులు మరియు శ్రేష్ఠత కలిగిన **విశ్వానికి ప్రభువు** వైభవం మరియు కీర్తిలో అపూర్వుడు. **దేవదూతలు ఇచ్చిన గుర్రంపై** స్వారీ చేస్తూ, చేతిలో **ఖడ్గం** పట్టుకుని, **లోక రక్షకుడు** దుర్మార్గులందరినీ అణచివేస్తాడు."

- ***కల్కి పురాణం 2 : 4, 5, 7, 11, 15*** లో కల్కి అవతారం యొక్క వివరణ ఈ విధంగా ఉంటుంది :

1. **తల్లి పేరు సుమతి అంటే ఆమిన.** *(కల్కి పురాణం 2 : 4,11)*

   ***కల్కి అవతారం తల్లి పేరు సుమతి. అంటే అర్థం సున్నితమైన మరియు ఆలోచనాత్మకమైన.***

   ప్రవక్త ముహమ్మద్ (అ) తల్లి పేరు అమీనా. అంటే అర్థం శాంతి మరియు సున్నితమైన.

**2. తండ్రి పేరు విష్ణుయాస అంటే అబ్దుల్లాహ్.**

***కల్కీ* అవతార్ తండ్రి పేరు "విష్ణుయాస" అంటే 'విష్ణువును ఆరాధించేవాడు / దేవుని ఆరాధకుడు'.**

ముహమ్మద్ (అ) తండ్రి పేరు అబ్దుల్లాహ్. అంటే అర్థం ' అల్లాహ్‌కి విధేయుడైన ఆరాధకుడు'.

**3. సంభాలా అంటే మక్కాలో జన్మించారు.**

***కల్కీ* అవతారం సంభాలా అనే గ్రామంలో పుడతారు. అంటే శాంతి భద్రతల ఇల్లు.**

ముహమ్మద్ (అ) పుట్టిన మక్కాను అరబ్బీ లో "దారుల్ అమన్" అంటారు. అంటే శాంతి భద్రతల ఇల్లు.

**4. గ్రామ పెద్ద ఇంట్లో జన్మించారు.**



***కల్కీ* అవతారం సంభాల గ్రామ పెద్ద ఇంట్లో పుడతారు.**

ముహమ్మద్ (అ) కాబా అధిపతి ఇంట్లో జన్మించారు.

**5. మాధవ్ అంటే రబీ-ఉల్-అవ్వల్ 12వ రోజున జన్మించారు.**

***కల్కీ* అవతారం మాధవ మాసంలోని ప్రకాశవంతమైన (మొదటి) అర్ధ 12వ రోజున జన్మిస్తారు.**

ముహమ్మద్ (అ) రబీ-ఉల్-అవ్వల్ మాసంలో ప్రకాశవంతమైన సగం **12**వ రోజున జన్మించారు.

**6. అతను అంతిమ లేదా చివరి అవతార్ అవుతారు.**

***కల్కీ* అవతారం అన్ని అవతారాలలో 'అంతిమ' అంటే 'చిట్ట చివరి' అని వర్ణించబడ్డారు.**

ప్రవక్త ముహమ్మద్ (అ) – అల్లాహ్ పంపిన చిట్ట చివరి ప్రవక్త.

**7. భగవంతుని నుండి పర్వతంపై జ్ఞానాన్ని పొంది ఉత్తరం వైపు వెళ్లి తిరిగి వస్తారు.**

***కల్కీ* పర్వతాలకు వెళ్లి పరశురాముని నుండి జ్ఞానాన్ని పొంది, ఉత్తరం వైపు వెళ్లి తిరిగి వస్తారు.**

ప్రవక్త ముహమ్మద్ (అ) జబుల్-నూర్ అంటే కాంతి పర్వతానికి వెళ్లారు, అక్కడ అతను ప్రధాన దేవదూత గాబ్రియేల్ నుండి మొదటి ద్యోతకాన్ని అందుకున్నారు. తరువాత అతను మదీనాకు ఉత్తరాన వెళ్ళాడు, తరువాత మక్కాకు విజయవంతంగా తిరిగి వచ్చారు.



**8. అతను అత్యంత మనోహరమైన వ్యక్తిత్వాన్ని కలిగి ఉంటారు.**

***కల్కీ* అవతారానికి అసమానమైన దయ ఉంటుంది.**

నిశ్చయంగా నీవు (ముహమ్మద్) గుణగణాల దృష్ట్యా అత్యున్నత స్థానంలో ఉన్నావు – *ఖుర్ఆన్ 68 : 4*

**9. ఎనిమిది ప్రత్యేక గుణాలతో కూడి ఉంటాడు.**

***కల్కీ* అవతారం ఎనిమిది ప్రత్యేక లక్షణాలను కలిగి ఉంటారు.**

అవి జ్ఞానం, గౌరవప్రదమైన వంశం, స్వీయ నియంత్రణ, బహిర్గత జ్ఞానం, పరాక్రమం, కొలిచిన వాక్కు, అత్యంత దాతృత్వం మరియు కృతజ్ఞత. ప్రవక్త (అ) ఈ **8** ప్రత్యేక లక్షణాలను కలిగి ఉన్నారు.



**10. ప్రపంచ గురువు.**

***కల్కి అవతారం ప్రపంచ రక్షకుడు – ప్రపంచానికి మార్గనిర్దేశం చేస్తారు, బోధిస్తారు.***

ప్రవక్త ముహమ్మద్ (అ) అరబ్బులకే కాకుండా మొత్తం మానవాళికి మార్గనిర్దేశం చేసి రక్షించారు.

**11. అతనికి శివుడు ఒక సవారీని అందజేస్తారు.**

***కల్కి అవతారానికి శివుడు అసాధారణమైన గుర్రాన్ని అందిస్తారని ప్రవచించబడింది.***

ముహమ్మద్ (అ) సర్వశక్తిమంతుడైన దేవుని నుండి ఒక సవారీ అందుకున్నారు, దానిని 'బురాక్' అని పిలుస్తారు. దానిపై అతను తన స్వర్గపు ప్రయాణాన్ని ఒక్క రాత్రిలో చేసారు.

**12. కల్కి *అవతారం* గుర్రము ఎక్కి కత్తిని మోయును.**

ప్రవక్త (అ) యొక్క చరిత్ర ప్రకారం, అతను స్వయంగా యుద్ధాలలో పాల్గొన్నారు. వాటిలో ఎక్కువ భాగం ఆత్మరక్షణ కోసం నగర సరిహద్దుల్లో పోరాడారు. అలాంటి అనేక సందర్భాలలో, అతను గుర్రంపై స్వారీ చేసారు మరియు చేతిలో కత్తిని పట్టుకున్నారు.



**13. ఆయన దుష్టులను అణచివేస్తారు.**

***కల్కి అవతారం దుష్టులను అణిచివేస్తాడని పేర్కొన్నారు.***

ప్రవక్త (అ) బందిపోట్లు మరియు దుర్మార్గులను శుద్ధి చేసి, వారిని సత్య మార్గంలో నడిపించారు.

**14. అతడు నలుగురు సహచరులతో కాళీని (దెయ్యాన్ని) జయిస్తారు**

***కల్కి అవతారం తన 4 సహచరులతో కలిసి కాళీని (దెయ్యాన్ని) నిరాయుధులను చేస్తారు.***

ప్రవక్త (అ) 4 అత్యంత విశ్వసనీయ సహచరులతో దెయ్యం దుశ్చర్యలకు వ్యతిరేకంగా పోరాడారు.

**15. అతనికి దేవదూతలు సహాయం చేస్తారు.**

***కల్కి అవతారానికి యుద్ధభూమిలో దేవదూతలు సహాయం చేస్తారు.***

బద్ర్ యుద్ధంలో, ప్రవక్తకు (అ) స్వర్గం నుండి దిగి వచ్చిన దేవదూతలు సహాయం చేసారు.

---

ఇలా పేరుతో సహా వారి జీవితం, వారి లక్షణాలు స్పష్టంగా గ్రంథాల్లో ప్రస్తావించబడ్డాయి. **హిందూ సోదర సోదరీమణులు ఎదురుచూస్తున్న** (చివరి) **కల్కి అవతారమే** (చివరి) **ప్రవక్త ముహమ్మద్** (అ). కాబట్టి, ముహమ్మద్ (అ) పేరు వినగానే, అరబ్ ముస్లిం ప్రవక్త అంటే అది ఒక భ్రమ. ప్రవక్త ముహమ్మద్ (అ) సర్వ మానవాళికి అంతిమ ఋషి అని స్పష్టంగా అనేక ఆధారాలు చూసాము.

**కాబట్టి, ఒక నిజమైన హిందువు యొక్క కర్తవ్యం ముహమ్మద్ (అ) వారిని గుర్తించటం, వారు తెచ్చిన (ఇస్లాం) ధర్మాన్ని స్వీకరించటం.**



# ఖుర్ఆన్ - చివరి దైవ గ్రంథం

మనం చూసినట్టు ఇంతకు ముందు పంపబడిన అందరు ప్రవక్తలు, అన్ని గ్రంథాలు కూడా ఒక నిర్దిష్ట కాలానికి వారి వారి సమాజాలకు మాత్రమే తాత్కాలికంగా ఉద్దేశించబడ్డాయి. కానీ ! ఇప్పుడు **ముహమ్మద్ (అ), ఖుర్ఆన్ కాలం చివరి వరకు మొత్తం మానవాళికి పంపబడ్డారు.**

దేవునిచే పంపబడ్డారని నిరూపించడానికి, ప్రవక్తలు దైవం అనుమతితో అద్భుతాలు చేసారు. సముద్రాలను చీల్చటం, చనిపోయినవారికి జీవం పోయటం, పుట్టుకతో అంధులను, కుష్ఠురోగులని స్వస్థపరచటం లాంటివి. కానీ గతంలో జరిగాయంటున్నా అద్భుతాలు మనం ఇప్పుడు చూడలేము.

- చివరి ప్రవక్త (అ) గారికి ఇచ్చిన వాటన్నిట్లోని అత్యంత మహాద్భుతమే **ఖుర్ఆన్ గ్రంథం**.

ఎందుకంటే **1400** సంవత్సరాల తర్వాత కూడా, మనం కళ్లారా చూడగలం, చెవులారా వినగలం. ఇది బుద్ధి, వివేకాలతో చదివేవారికి ఎల్లప్పుడూ అద్భుతాలు చూపిస్తూనే ఉండే గ్రంథం.



# ఖుర్ఆన్ ఒక శాస్త్రీయ అద్భుతం



**14** శతాబ్దాల పాత ఖుర్ఆన్ శాస్త్రవేత్తలు ఇటీవలె కనుగొన్న చాలా వాటిని ప్రస్తావించింది.

❖ **Dr. కీత్ మూర్ 1981 లో ఇలా అన్నారు :** *"మానవ పిండం యొక్క వర్ణనలను 7వ శతాబ్దం శాస్త్రీయ పరిజ్ఞానంపై ఆధారపడి ఉండడం **అసాధ్యం**. ఇవి దేవుని నుండి వెల్లడి చేయబడ్డాయి అనేది **వాస్తవం**".*

ఖుర్ఆన్‌లో సృష్టికర్త అల్లాహ్ మాత్రమే చెప్పగలిగిన అనేక శాస్త్రీయ అద్భుతాలలో కొన్ని :

- మానవ పిండం అభివృద్ధి యొక్క అన్ని దశల గురించి వివరంగా చెప్తుంది *( ఖుర్ఆన్ 23 : 12 – 14, 39 : 6 )*
- పుట్టబోయే బిడ్డ ఆడా లేక మగా అనేది భర్తను బట్టి ఉంటుందని *( 53 : 45 – 47 )*



*" ఆయనే కార్చబడే వీర్యబిందువుతో ఆడమగ జంటల్ని పుట్టిస్తున్నాడు. "*

- సూర్యుడు, భూమి, చంద్రుడు స్వంత కక్ష్యలను కలిగి, వాటి చుట్టూ అవి తిరుగుతాయని *( 21 : 33 )*
- సూర్యుడుది సొంత కాంతని, చంద్రుడు కేవలం ఆ కాంతని ప్రతిబింబిస్తాడని *( 25 : 61 )*
- విశ్వానికి ఆరంభం బిగ్ బ్యాంగ్, మొదట్లో పొగవలె ఉండేదని, విస్తరిస్తోందని *(21 : 30, 41 : 11, 51 : 47)*



ప్రతి జీవి నీళ్లతో నిర్మితమైందని, ప్రతిదీ జంటగా సృష్టించబడిందని *( 21 : 30 , 36 : 36 )*

*" భూమ్యాకాశాలు కలసిఉన్నప్పుడు మేము వాటిని విడదీయడాన్ని వారు చూడ లేదా? అలాగే ప్రతిప్రాణిని మేము నీటితో సృజించిన విషయాన్ని వీరు గమనించ లేదా? "*

ఇనుము, నీరు నిజానికి భూమి నుండి కాదు, అంతరిక్షం నుండి పంపబడ్డాయని *( 57 : 25 , 23 : 18 )*

- ఆకాశం పైకప్పుగా ఉందని (ఓజోన్ పొర) , మేఘాలు బరువుగా ఉంటాయని *(21:32 , 7 : 57 , 13 : 12)*



- పూర్తి జలసంభంద చక్రం గురించి ( 50 : 9 - 11, 23 : 18 - 19, 15 : 22, 30 : 48, 7 : 57, 39 : 21, 36 : 34, 56 : 68 - 70 )
- వేలిముద్రలు అందరికీ ప్రత్యేకమని, చర్మంలో నొప్పి గుర్తించే గ్రాహకాలున్నాయని ( 75 : 4 , 4 : 56 )



*" ఏమిటీ, మానవుడు మేమతని ఎముకలను కూర్చలేమని అనుకుంటున్నాడా? తప్పకుండా కూర్చగలము. మేము అతని వ్రేళ్ళ కొనలను సైతం (యధాతథంగా) తిరిగి రూపొందించగలం. "*

- చీమలు మాట్లాడుకుంటాయని మరియు రెక్కలు లేని చీమలన్నీ ఆడవని (27 : 18) 
- ఐన్‌స్టీన్ రిలేటివిటీ థియరీ, అణువు కంటే చిన్న కణాలున్నాయని (హిగ్స్ బోసాన్) (32:5,22:47,10:61) 
- ఇటీవల 1881లో కనుక్కున్న రాంసేస్ II మమ్మీ భవిష్యత్ తరాలకి చిహ్నంగా ఉంటుందని (10 : 92)
- భూమి కంపించ కుండా పర్వతాలు మేకులలాగా పట్టి ఉంచుతాయని (21 : 31) 

*" భూమి దొర్లిపడకుండా ఉండేందుకు మేము దానిపై పర్వతాలను (మేకులుగా) పాతాము. "*



................................................................ **ఇలా ఎన్నో ఇంకా ఎన్నెన్నో !**

**ఈ జ్ఞానం ఎక్కడ నుండి వచ్చింది?**

ఇంత వివరంగా విశ్వాన్ని, మానవుల అంతర్గతాలని, ప్రకృతిని వర్ణించగలిగేది **ఎవరు**?

అప్పటికింకా తెలియని **గతాన్ని**, జరగబోయే **భవిష్యత్తును** 100% కచ్చితంగా ఎవరు చెప్పగలరు?

**గొర్రెల కాపరి** అయిన **అనాథ నిరక్షరాస్యుడు** ఈ గ్రంథాన్ని ఎలా రాయగలడు?

1400 సంవత్సరాల క్రితం ఒక **ఎడారి మనిషికి** ఇవన్నీ ఎలా తెలుసు?

అతను వీటన్నిటి గురించి అసలు ఎందుకు ప్రస్తావిస్తారు?

ఈ మహానుభావుడిని నేటికీ **200** కోట్ల మంది ఎలా అనుసరిస్తున్నారు?

# ఖచ్చితంగా ఖుర్ఆన్ పూర్తిగా దేవుని మాట !



1. ఖుర్ఆన్ **1400** ఏళ్లుగా ఒక్క **అక్షరం పొల్లు కూడా మారని ఏకైక దైవగ్రంథం**.
2. అరబ్బీ ఇప్పటికీ వాడుకలో ఉన్నందున **అసలు సందేశం** కాలాంతరం కోల్పోలేదు.
3. **పూర్తిగా భద్రపరచబడింది**. ప్రపంచవ్యాప్తంగా ఒకే ఖుర్ఆన్‌ని చదువుతారు.
4. **ఒక్క తప్పూ లేని**, లోపం లేని, ఒక్క అశాస్త్రీయ అంశం కూడా లేని **ఏకైక దైవగ్రంథం.**
5. **సైన్స్** (శాస్త్రము) గురించి మాట్లాడినా, **భవిష్యత్తు** గురించి ప్రవచించినా లేదా తెలియని **గతం** గురించి చెప్పినా, నిరూపించగలిగేవన్నీ 100% **సరైనవని తేలాయి**.
6. **ప్రపంచంలో కోట్లాది మంది 6236 వాక్యాల ఖుర్ఆన్ మొత్తం కంఠస్థం చేస్తారు**.
7. దేవుడి **సవాల్ :** ఇలాంటిది ఉత్పత్తి చేయమని లేదా **ఒక్క** తప్పయిన కనుగొనమని !

* ఖుర్ఆన్‌లో ఇప్పటివరకు ఒక్క తప్పు కూడా ఎవరూ కనుక్కోలేకపోయారు !

- ***ఖుర్ఆన్ 4 : 82*** లో ఏ రకమైన తప్పు ఒక్కటి కూడా లేకపోవటం ఎలానో అల్లాహ్ చెప్తున్నారు

  "వారు ఖుర్ఆన్ గురించి ఆలోచించరా? **ఇది అల్లాహ్ నుండి గాకుండా మరెవరి నుండో వచ్చివుంటే ఇందులో తీవ్రమైన విభేదం (వైరుధ్యం) ఉండేది కదా !"**



- ***ఖుర్ఆన్ 11 : 13 - 14*** లో అల్లాహ్ **మానవాళికి** ఇలా **సవాల్** చేస్తున్నారు :

  "ఈ **గ్రంథాన్ని ప్రవక్త స్వయంగా కల్పించుకున్నాడని అంటున్నారా?** అయితే వారినిలా అడుగు: "సరే, **ఇలాంటి పది అధ్యాయాలు రచించి తీసుకురండి.** (కావాలంటే) ఈ పనిలో మీకు సహాయపడేందుకు ఒక్క దేవుడ్ని వదలి మీరు ఎవరెవర్ని పిలుచుకోగలరో పిలుచుకోండి. మీరు నిజాయితీపరులైతే?" ఒకవేళ **చేయలేకపోతే, ఈగ్రంథం (మానవమేధా జనితంకాదని) దైవజ్ఞానంతో అవతరించిందని, ఆ దేవుడు తప్ప మరో ఆరాధ్యుడు లేడని తెలుసుకోండి.** మరి మీరు ఇప్పటికైనా ముస్లింలు (ఏకేశ్వరునికి సమర్పించినవారు) అవుతారా?"



ఆనాడు "సాహిత్య పరంగా మాకు మించిన వారు ఎవరూ లేరు" అని గర్వించే అరబ్బీ మహాకవులు, ఈ ఖుర్ఆన్‌ను విని దిగ్భ్రాంతులు చెందారు."**ఇది మానవ రచన కానే కాదు" అని అంగీకరించారు !**



ఖుర్ఆన్‌లో అతి చిన్న అధ్యాయం **3** వాక్యాలు (**10** పదాలు). అయినా ఇలాంటి ఒక్క అధ్యాయం కూడా ఎవ్వరూ రాయలేకపోయారు. **ఒక నిరక్షరాస్యుడు ఈ మహాద్భుతాన్ని ఎలా రాయగలడు?**

ఖుర్ఆన్ మానవ సామర్థ్యానికి మించినది. నిస్సందేహంగా ఇది దైవం అవతరింపజేసిన గ్రంథం.

## ప్రవక్త (అ) యొక్క ఇతర అద్భుతాలు



**అల్లాహ్ అనుమతితో** ప్రవక్త (అ) అనేక అద్భుతాలు చేసారు. వీటిని చాలా మంది చూశారు.

1. **చంద్రుడు రెండుగా విడిపోవడం** *(ఖుర్ఆన్ 54 : 1 – 2)*

   "నువ్వు నిజమైన ప్రవక్తయితే చంద్రుడ్ని విడదీయి !" అని అవిశ్వాసులు అరేబియా ప్రవక్తకు సవాలు చేసినప్పుడు, తన వేలును చంద్రుని వైపు చూపాడు. అప్పుడది **అల్లాహ్ చిత్తముతో రెండుగా** విడిపోయింది. ఈ అద్భుతాన్ని **కేరళ రాజు** చేరమాన్ పెరుమాళ్ కళ్లారా చూసినట్లు చరిత్రలో నమోదైంది. ఒక ముస్లిం వ్యాపారుల బృందం, "అరేబియా ప్రవక్తకు దేవుడు చంద్రుని విభజన యొక్క అద్భుతంతో మద్దతు ఇచ్చాడు" అని కేరళ రాజుతో చెప్పారు. దిగ్భ్రాంతి చెందిన రాజు, అది తాను కళ్లారా చూశానని, అరేబియాకు వెళ్లారు. **ఇతను ఇస్లాం స్వీకరించిన మొదటి భారతీయుడు.**

2. **ప్రవక్త (అ) వేళ్ల నుండి నీరు ప్రవహించడంతో 1500 మంది సహచరుల దాహం తీర్చారు.**
3. **కేవలం అతని (అ) శ్వాస, ఉమ్ము రోగులను, అంధులను నయం చేసేవి** - bit.ly/miraclemhmd
4. ఆయన **ప్రార్థనతో వర్షం** కురిసేది. **ఆజ్ఞతో చెట్లు కదిలేయి.** జంతుభాషను అర్థం చేసుకునేవారు.

**5. దేవదూత గెబ్రియల్ తో కలిసి ఒక్క రాత్రిలో** మక్కా నుండి జెరూసలేం వెళ్ళి, జెరూసలేం నుండి అల్లాహ్‌తో మాట్లాడటానికి 7 స్వర్గాలను దాటి వెళ్లి, మళ్లీ మక్కాకు అదే రాత్రిలో తిరిగొచ్చారు.

ఇంకా ఇలాంటి అద్భుతాలు, ప్రవచించిన తర్వాత భవిష్యత్తులో **100%** నిజం ఐన సంఘటనలు చాలా ఉన్నాయి. పైనున్న అద్భుతాలు అసాధారణమైనప్పటికీ, అతి గొప్పది ఖుర్‌ఆన్ !



## మహా ప్రవక్త (అ) జీవితం

ప్రవక్తగా నియమించబడక ముందు అయన నమ్మకస్థుడన్న పేరున్న ఒక వ్యాపారి, ధనవంతుడు.

- ప్రవక్త **అవ్వటం తరువాత, దాని కారణంగా, అతను తీవ్రమైన పేదరికంలో బతికారు.**

వారి ఇంట్లో పొయ్యి వెలగకుండా నెలలు గడిచేవి. నీళ్లు, కజ్జురాలు, పాలతో గడిపేవారు. ఆకలికి తట్టుకోలేక కడుపు చుట్టూ రాళ్లు కట్టుకునేవారు. పీచు పరుపు మీద పడుకునేవారు. మంచి తాజా రొట్టె కూడా ఎప్పుడూ తినలేదు. పేరు మీద పైసా కూడా లేనంతగా దానాలు చేసి, చనిపోయారు.

- **రాజ్యాలు రాసిస్తాం అని అన్నా కూడా** దేవుడి సందేశం మానవాళికి ఇవ్వటం ఆపని మహా ప్రవక్త.
- అతన్ని హింసించారు, నిందించారు, తిరస్కరించారు, ఉమ్మేసారు, బహిష్కరించారు. తల నుంచి కాళ్ళ వరకు రాళ్లతో కొట్టినప్పుడు, రక్తం నిండిన బూట్లతో కొట్టిన వాళ్ళని క్షమించమని ప్రార్థించారు.
- ఇస్లాం ముందు కాలాన్ని అరబ్బులు **'అజ్ఞాన యుగం'** అంటారు. ఆయన అప్పటి మానవ బలులని, ఆడపిల్లల్ని సజీవంగా పాతిపెట్టడాన్ని, కొట్టుకు చంపుకునే గొడవలని, అపరిమిత బహుభార్యత్వాన్ని, బానిసలపై క్రూరత్వాన్ని, తాగుబోతుతనాన్ని, జూదం వ్యసనాలని, **వీటన్నింటిని నిర్మూలించారు.**
- అమ్మాయి పుడితే **సజీవంగా పూడ్చే జనాలతో "ఆడపిల్లలు పుట్టటం అదృష్టం"** అనేలా చేసారు.
- **23** సంవత్సరాలలో, ఒకళ్ళతో ఒకళ్ళు పోరాడుకునే తెగలను, దోపిడీ దొంగలను ఒకచోట చేర్చి, **వెనుకబడిన సమాజాన్ని గొప్ప నాగరికతగా,** బహుదైవారాధకులని ఒకే మతం కింద ఏకం చేశారు.
- ప్రవక్త ముహమ్మద్ (అ) ఒక మతాన్ని బోధించారు, ఒక దేశాన్ని నిర్మించారు, నైతిక నియమాలని నిర్దేశించారు, లెక్కలేనన్ని రాజకీయ, సామాజిక **సంస్కరణలను** చేసారు. సైనిక, సామాజిక, సాహిత్య రంగాలను, విజ్ఞాన శాస్త్రాన్ని, మానవ మనస్తత్వాలను **ఎన్నడూ ఎరుగని విధంగా మార్చారు.**
- **ఇన్ని బాధ్యతలు ఉన్నప్పటికీ,** అయన ఒక అంకితమైన భర్త, ప్రేమగల తండ్రి. మేక పాలు తీయటం, ఇంటి పనులలో సాయంచేయడం, చినిగిపోయిన బట్టలు, బూట్లు తానే కుట్టుకోవటం, అనారోగ్య, పేద ప్రజలను పరామర్శించటం చేసేవారు. అతని జీవితం సరళత, వినయానికి అద్భుతమైన నమూనా.




**"చరిత్రలో అత్యంత ప్రభావవంతమైన 100 మంది వ్యక్తులు"** అనే పేరుతో *మైఖేల్ హెచ్. హార్ట్,* ఒక క్రైస్తవ చరిత్రకారుడు రాసిన పుస్తకంలో **ముహమ్మద్ (అ) 1** స్థానంలో నిలిచారు.




# ఇస్లాం పై ఉన్న కొన్ని అపోహలు







- ## జిహాద్

జిహాద్ అంటే **శ్రమ పడటం.** మీరు పరీక్ష పాస్ అవ్వటం కోసం శ్రమ పడటాన్ని కూడా జిహాద్ అని అంటారు. ఇస్లాంలో 'జిహాద్' అంటే ఒకరి **స్వంత చెడు ధోరణికి వ్యతిరేకంగా** శ్రమ పడటం. అల్లాహ్ (దేవుని) మార్గంలో **ధర్మబద్ధమైన లక్ష్యం** కోసం, సమాజాన్ని బాగుచేయడానికి కృషి చేయడం, దేవుడి మార్గంలో ఖర్చుపెట్టటం (దానం) కూడా జిహాద్.

- *భగవద్గీత 2 : 50* లో జిహాద్ గురించి ఇలా



"అందుచేత, ఓ అర్జునా, అన్ని పనుల కళ అయిన యోగా కోసం శ్రమ పడు."

- ఆత్మరక్షణ కోసం, అణచివేతకు, దురాక్రమణకు వ్యతిరేకంగా పోరాడే హక్కు కూడా జిహాద్.



- *భగవద్గీత 2 : 33* లో జిహాద్ యొక్క అనేక రూపాలలో ఒకటైన యుద్ధ పోరాటం గురించి ఇలా

**"ఓ అర్జునా !** మీరు ఈ **ధర్మయుద్ధంలో పోరాడకుండా మీ మతానికి దూరంగా ఉంటే** మీరు ఖచ్చితంగా **పాపానికి గురవుతారు.** మీ కీర్తిని, **గౌరవాన్ని కోల్పోతారు."**

ఒకవేళ పైన వాక్యం ఒక్కటే చూసి "భగవద్గీత చంపమంటుంది" అని మాట్లాడితే తప్పు అవుతుంది కదా ! ఎందుకంటే గ్రంథంలో వాక్యం యొక్క సందర్భం పరిగణలోకి తీసుకొని అర్థం చేసుకోవాలి.

ఇలాగే ఖుర్ఆన్ కూడా, సత్యం అసత్యం మధ్య ధర్మయుద్ధంలో పోరాటం గురించి మాట్లాడుతుంది. కానీ ఒకవేళ శత్రువు ఆశ్రయం అడిగితే, వారిని సురక్షితమైన ప్రదేశానికి తీసుకెళ్లమని ఆదేశిస్తుంది.

- ఇస్లాం మొదటి ఖలీఫా (పాలకుడు) ***అబూ బకర్ సిద్ధీఖ్*** *(ర)* తన సైన్యాధిపతితో ఇలా చెప్పారు :

"స్త్రీలను, పిల్లలను, పసికందులను, వృద్ధులను **చంపవద్దు.** ద్రోహం చేయవద్దు, ఋజు మార్గం నుండి తప్పుకోవద్దు, అతిగా ప్రవర్తించవద్దు, అగ్నితో **శిక్షించవద్దు,** మృతదేహాలను ముక్కలు చేయకూడదు, చెట్లకు ఎటువంటి **హాని కలిగించవద్దు,** ముఖ్యంగా ఫలాలు ఉన్న వాటిని అగ్నితో కాల్చవద్దు, శత్రువుల పశువులను చంపవద్దు, వాటిని ఆహారం కోసం దాచుకోండి, సేవకు తమ జీవితాలను అంకితం చేసిన **సన్యాసులను వదిలేయండి."**

- *ప్రవక్త (అ)* ఇలా అన్నారు : *"శాంతి ఒప్పందం ఉన్న వ్యక్తిని ఎవరు చంపినా వారు స్వర్గం యొక్క పరిమళాన్ని కూడా పీల్చలేరు, స్వర్గం సువాసన నలభై ఏళ్ల దూరం వరకు ఒస్తుంది." **(సహీహ్ బుఖారి 6914)***



ఇస్లాం ఇలాంటి మానవీయ, గొప్ప వైఖరిని తన అనుచరులకు అవలంబించమని ఉద్బోధిస్తుంది.

**ఇంతకంటే గొప్ప దయగల సైనిక నీతి నియమాలు, యుద్ధ చరిత్రలో ఉన్నాయా?**

- **ఇస్లాం ఖడ్గం ద్వారా వ్యాపించింది** 

ప్రఖ్యాత చరిత్రకారుడు డి లేసీ ఓలేరీ ఇలా వ్రాశారు: *"చరిత్ర స్పష్టం చేస్తుంది ఏమనంటే మతోన్మాద ముస్లింలు రాజ్యాలు జయించిన తరువాత కత్తితో బలవంతంగా మాత మార్పిడి చేశారు అనేది* ***చరిత్రకారులు పదేపదే చెప్పే అత్యంత పెద్ద అవాస్తవాలలో ఒకటి."***

వందల సం" ఏలినా కూడా ఇప్పటికీ అరేబియాలో క్రైస్తవులు, ఇండియాలో ఎక్కువ శాతం హిందువులు ఉన్న నిజం ఈ అబద్ధపు ప్రచారానికి వ్యతిరేకం. ఇంకా మలేసియాకి, ఆఫ్రికా తూర్పు తీరం దేశాలకు, ప్రపంచంలోనే అత్యంత ఎక్కువ ముస్లిం జనాభా ఉన్న ఇండోనేషియాకి ఏ ముస్లిం సైన్యం వెళ్ళింది**?** కత్తితో కాదు, ఇవన్నీ ఇస్లాం యొక్క శాంతియుత సత్యం తెలుసుకొని మారిన దేశాలు.

 **ఉగ్రవాదం** - ఇస్లాంలో బహుదేవతారాధన తర్వాత రెండో అతి పెద్ద ఘోర పాపం "హత్య".

- ***ఖుర్ఆన్ 5 : 32*** లో ప్రాణం అత్యంత విలువైనదని అల్లాహ్ (సృష్టికర్త) ఇలా అంటున్నారు

*"అకారణంగా ఎవరైనా ఒక మానవుని* ***(అన్యాయంగా) చంపినట్లు అయితే, అతడు సమస్త మానవాళిని చంపినట్లే!*** *అలాగే ఎవరైనా ఒక మానవుని ప్రాణాన్ని రక్షిస్తే, అతడు సమస్త మానవాళిని కాపాడినట్లే."*

కావున, ఇస్లాం మరియు ముస్లింల ప్రకారం **ఉగ్రవాదం నిషిద్ధం !** అది ఒక అసహ్యకరమైన చర్య. ముస్లింలు అనుసరించే ఇస్లాం మతం శాంతి, దయ మరియు క్షమాపణకు పరాకాష్ట. కొంతమంది చెడ్డ వ్యక్తులు చేసే హింసాత్మక సంఘటనలతో ముస్లింలకు, ఇస్లాంకి సంబంధం లేదు. ఒక ముస్లిం వ్యక్తి తీవ్రవాద చర్యకు పాల్పడితే, ఆ వ్యక్తి ఇస్లాం చట్టాలను ఉల్లంఘించినందుకు ఘోర పాపం చేసిన దోషి.

 ఉగ్రవాదం కేవలం ముస్లింలు మాత్రమే కాదు, అన్ని మతాల వారు చేస్తారు. అవన్నీ ఖండించాల్సిన చెర్యలు. కానీ ఇస్లాం పేరుతో తప్పుగా చేసేది మాత్రమే **మీడియా** హైలైట్ చేస్తుంది !

- **హక్కులు**



- ఇస్లాం సంపద, అధికారం, జాతి, రంగు, లింగం కారణంగా ఉండే వివక్షకు తీవ్రంగా వ్యతిరేకం. **భగవంతుడు మనుషులందరినీ సమానంగా సృష్టించాడు.** దేవుని దృష్టిలో మానవులు కేవలం వారి విశ్వాసం, భక్తి ఆధారంగా మాత్రమే వేరు చేయబడతారు.

- **ముస్లిం మహిళల హక్కులు** – ఇస్లాంలో పురుషులు, స్త్రీలు విలువలో సమానం.

విలువలలో సమానం కానీ పాత్రలు వేరు. పురుషుడు కుటుంబ రక్షకుడు, పోషించడం తన భాద్యత.

- **ఇస్లాం భార్యల పట్ల అసమానత, వివక్షను రద్దు చేసి వారికి హక్కులు, కీర్తి, గౌరవాన్ని ఇచ్చింది.**

- అమ్మాయిలకి ఆస్తి, వారసత్వ హక్కులుంటాయి. మహిళలు ధార్మిక జ్ఞానాన్ని పొందవచ్చు, వారి స్వంత సంపదపై పూర్తి హక్కుంటుంది, సాక్ష్యం చెప్పొచ్చు, వివాహం తర్వాత తమ ఇంటిపేరును ఉంచుకుంటారు, విడాకులు అడగవొచ్చు, ఎవరిని పెళ్లి చేసుకోవాలో నిర్ణయించుకోవడంలో మహిళలదే తుది నిర్ణయం, అబ్బాయి అమ్మాయికి కట్నం (మెహర్) ఇవ్వాలి, విడిపోతే మెహర్ తిరిగివ్వక్కర్లేదు, విడిపోయినా పిల్లల్ని తండ్రి 2 సం" పోషించాలి, ఇంకా ఇలా ఎన్నో హక్కులున్నాయి.
- "తల్లి పాదాల దగ్గర స్వర్గం ఉంది" అని ఇస్లాం బోధిస్తుంది. తల్లిని ఉత్తమంగా చూసుకోవాలి. వాళ్ళని కసురుకోకుండా, విసుక్కోకుండా, గౌరవాదరణలతో పలకరించాలి. కృతజ్ఞత చూపాలి. ఇందుకే "**వృద్ధుల** గృహాలను" ముస్లింలు ఆమోదించరు. సేవ చేయటం ఒక ఆశీర్వాదంగా భావిస్తారు.

## • బహు భార్యాత్వము



రాముడి తండ్రి దశరథుడికి ***రామాయణం అయోధ్య కండ సర్గ : 34*** ప్రకారం **353** భార్యలు.

***మహాభారతంలో*** శ్రీ కృష్ణుడికి **16108** భార్యలు మరియు రాధ కృష్ణుడి భార్య కాదు.

బ్రహ్మకి, శివుడికి, కార్తికేయునికి, శనికి, సుబ్రమణ్యునికి **2.** విష్ణుకి, యముడికి **3.** గణపతికి **5.**

- ***మహాభారతం అనుశాసన పర్వం పేజీ 17*** లో భీష్ముడు ధర్మరాజుతో ఇలా అంటారు

*"బ్రాహ్మణుడు 3 భార్యలను తీసుకోవచ్చు. క్షత్రియుడు 2 భార్యలను తీసుకోవచ్చు. వైశ్యుని విషయానికొస్తే, అతను తన స్వంత కులం నుండి మాత్రమే భార్యను తీసుకోవాలి."* *(విష్ణుసూత్ర 24 : 1 లో కూడా)*

కాబట్టి గ్రంధాల ప్రకారం బహుభార్యాత్వం హిందూమతంలో అనుమతించబడుతుంది. కానీ ఇటీవల **1954** లో భారతదేశం హిందూ వివాహ చట్టాన్ని ప్రవేశపెట్టడంతో చట్టవిరుద్ధంగా మారింది.

- ఇస్లాంలో బహు భార్యాత్వము తప్పనిసరి కాదు. అయితే "ముస్లిం వ్యక్తిగత చట్టం" పరంగా అనుమతించబడినప్పటికీ కేవలం **< 2.6%** మంది మాత్రమే ఇలా వివాహాలు చేసుకుంటారు !
- ప్రపంచంలో **"ఒక్క భార్యను మాత్రమే"** వివాహం చేసుకోమని చెప్పే ఏకైక మత గ్రంథం ఖుర్ఆన్ **!**
- ***ఖుర్ఆన్ 4 : 3*** – *".. మీకు నచ్చిన స్త్రీలలో ఇద్దర్నిగాని, ముగ్గుర్ని గాని, నల్గుర్నిగాని చేసుకోవచ్చు. అయితే వారి మధ్య కూడా న్యాయంగా వ్యవహరించలేమని భావిస్తే **ఒక్కర్నే** వివాహమాడండి."*
- పురుషుడికి శారీరకంగా, ఆర్థికంగా, మానసికంగా సామర్థ్యం ఉంటే మరో పెళ్లి చేసుకోవొచ్చు. అందరు భార్యలని సమానంగా చూసి అన్నీ హక్కులు ఇవ్వాలి. ఎక్కువ పిల్లలు కావాలనుకునే వాళ్ళకి నీతిమంతమైన మార్గం ఇది. దీనివల్ల సమాజానికి చాలా లాభం ఉంది. వివాహేతర సంబంధాలు, వ్యభిచారం తగ్గుతాయి. వితంతువులు, విడాకులు తీసుకున్నవారికి కొత్త జీవితం లభిస్తుంది.
- **ప్రవక్త** (అ) ఎక్కువ శాతం విడాకులు తీసుకున్నవారిని లేదా వితంతువులనే పెళ్లి చేసుకున్నారు !

## • ట్రిపుల్ తలాక్ (మూడు విడాకులు)



నికాహ్ (వివాహం) అనేది స్త్రీ పురుషుల మధ్య జరిగే పవిత్ర ఒప్పందం. కానీ కొన్ని సార్లు అనివార్య కారణాల వల్ల విడాకులు తప్పవు. ఉదాహరణకు: తాగుబోతు భర్త కొట్టి హింసిస్తాడు, తిరుగుబోతు భాగస్వామి, భర్త నపుంసకుడు, అబద్దాల పెళ్లి, మొదలగు సందర్భాలలో అమ్మాయిలకు విడాకులు తీసుకునే స్వేచ్ఛ స్వతంత్రం, స్త్రీ పురుషులకు సమాన హక్కులు ఇస్లాం ఇస్తుంది. పునర్వివాహాన్ని ప్రోత్సాహిస్తుంది. దీనివల్ల సమాజంలో చెడు తగ్గి, భార్య తనను, తన పిల్లలని కాపాడుకుంటుంది.

ఇలాంటి సందర్భాలకు హిందూ మతంలో పరిష్కారం లేదు. చచ్చినట్టు ఇద్దరూ కలిసి ఉండాల్సిందే. కానీ ఇస్లాం (హిందూ మతంలో లేని) చాలా వాస్తవిక పరిష్కారం ఇస్తుంది. అలాగని ఎవరైనా తప్పుగా ఒకేసారి **3** విడాకులు ఇస్తే, తాను పాపం చేసినవాడవుతాడు. ఇస్లాం అది ఎంత మాత్రం ప్రోత్సహించదు. విడాకులకు ముస్లింలు పాటించవలసిన **ప్రవక్త** (అ) వారి సున్నాహ్ పద్ధతి ఇది :

1. ముందుగా ఇద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకుని సమస్యను పరిష్కరించుకోవాలి.
2. ఒకవేళ అది సరిపోకపోతే ఇద్దరి కుటుంబాల నుండి మధ్యవర్తిని పిలిచి మాట్లాడుకోవాలి.
3. అప్పుడు కూడా కలవకపోతే, విడాకులు తీసుకునే ఉద్దేశంతో **3** నెలలు విడిగా ఉండాలి.

ఈ మూడు నెలలు చాలా కీలకం. వారు పూర్తిగా విడిపోయినట్లు కాదు కానీ కలిసి విడాకులు రద్దు చేసుకోవచ్చు. ఆవేశంలో చేసిన తప్పును తెలుసుకోవటానికి, విడిగా ఉన్నాక ఇద్దరికీ కలిసుండాలని ఆశ పుడుతుందేమో అని చూడటానికి, ఒకవేళ భార్య కడుపుతో ఉంటె అది కచ్చితంగా తెలుసుకోటానికి, మొదలగు కారణాల కోసం ఈ సమయం ఉపయోగపడుతుంది . . . ఈ సమయంలో ఎప్పుడైనా తప్పు అని తెలుసుకుంటే వారు కలిసిపోవొచ్చు. ఒకవేళ **3** నెలల గడువు పూర్తయిన తరవాత కూడా విడాకులు కావాలి అని అనుకుంటే, అప్పుడు మాత్రమే వారికి విడాకులు ఇస్తారు.

***"నిజానికి ఇస్లాంలో విడాకుల శాతం చాలా తక్కువ. కేవలం 2 - 4% మాత్రమే ఉండొచ్చు."***

- ఒకసారి విడాకులు తీసుకున్నాక మళ్ళీ పెళ్లి చేసుకోవాలంటే అదే జంట తిరిగి నికాహ్ (వివాహం) చేసుకోవొచ్చు. రెండో సారి విడాకులకు కూడా మొదటిలాగే కలవటానికి ప్రయత్నించి **3** నెలలు ఆగాలి.
- మూడోసారి కూడా ఇదే వర్తిస్తుంది. కానీ మూడు సార్లు తరవాత వ్యవస్థని దుర్వినియోగించకుండా ఆ జంట మళ్ళీ కలవటానికి అనుమతిలేదు. అప్పుడు భార్య వేరే మగాడిని (విడాకుల కోసమే అని కాకుండా) పెళ్లి చేసుకోవాలి. ఒకవేళ అతనితో విడాకులు తీసుకుంటే, అప్పుడు మాత్రమే నాలుగో సారి అదే జంట తిరిగి వివాహం చేసుకోవొచ్చు. ఈ సమస్యలన్నింటినీ ఇదే నైతిక పద్ధతిలో పరిష్కరించాలి.

**ఏ దేశంలోనూ ఏ మతంలోనూ లేని అత్యంత స్వచ్ఛమైన నైతిక నియమావళి ఇస్లాం !**



## ▪ హిజాబ్ (ముసుగు) & బుర్కా (పరదా)

హిజాబ్ అనేది ముస్లింలకే ప్రత్యేకం కాదు. అనేక మతాల స్త్రీలు తరతరాలుగా వినయానికి నిదర్శనంగా హిజాబ్ పాటిస్తున్నారు. దీని గురించి గ్రంథాలు ఎం చెప్తున్నాయో చూద్దాం :

- ***ఋగ్వేదం 10 : 85 : 30*** లో ఇలా ఉంది

  "బ్రహ్మ నిన్ను స్త్రీగా చేసాడు, మీరు పైకి చూడకూడదు, మీ **చూపులు కిందికి దించి చూడాలి** . . . **వస్త్రం, ముసుగు** ఏమి దాచిపెడుతుందో అవి బయటపెట్టకూడదు."

- ***మహావీర చరిత్ర 2 : 71*** లో పరశురాముడు వస్తున్నప్పుడు **రాముడు సీతతో** ఇలా అంటారు

  "అతను పెద్దవారు, దయచేసి **మీ చూపులు కిందికి దించి, ముసుగు ధరించండి**."

ఇలా మీరు విశ్లేషిస్తే హిందూ గ్రంథాలు కూడా స్త్రీలు హిజాబ్ ధరించాలని, తమ చూపులను కిందికి దించాలని చెబుతున్నాయి. కానీ కొంత మంది హిందువులు హిజాబ్ ధరించరు, వారి పవిత్ర గ్రంథాలలో వ్రాసిన వాటిని పాటించరు. దానికి ఎవరికీ ఏ అభ్యంతరం లేదు.

కానీ ఇస్లాం అనుచరులపై వేళ్లు చూపడం తగదు. ఎందుకంటే ఖుర్ఆన్ గ్రంథం కచ్చితంగా పూర్తిగా దేవుని వాక్యమని ముస్లింలు విశ్వసిస్తారు మరియు ఆ ఏకేశ్వర దైవం అల్లాహ్ ఆజ్ఞలను పాటిస్తారు.

- ***ఖుర్ఆన్ 24 : 30*** లో అల్లాహ్ స్త్రీలకన్నా ముందు పురుషుల హిజాబ్ గురించి చెప్పారు

  *"విశ్వాసి తన చూపులను కిందకి దించాలి మరియు అతని పవిత్రతని కాపాడుకోవాలి".*

- ***ఖుర్ఆన్ 33 : 59*** లో స్త్రీల గురించి ఇలా

  " . . చెప్పు ; వారు తమపై నుంచి దుప్పట్లను క్రిందికి వ్రేలాడేవిధంగా కప్పుకోమని. తద్వారా వారు చాలా తొందరగా (మర్యాదస్తులుగా) గుర్తించబడతారు. వేధింపులకు గురికాకుండా ఉంటారు."

- ఇస్లాం హిజాబ్ కి ఆరు షరతులున్నాయి. **1.** ఇదొక్కటే స్త్రీ పురుషుడి మధ్య తేడా. పురుషుడు నాభి నుంచి మోకాలి వరకు కప్పుకోవాలి. స్త్రీ ఆమె శరీరాన్ని పూర్తిగా కప్పుకోవాలి – ముఖం, మణికట్టు వరకు చేతులు మాత్రమే చూడగలిగే భాగం (కొందరు పండితులు ఇవి కూడా కప్పుకోవాలంటారు) **2.** బట్టలు దాగున్నది చూపించే విధంగా గట్టిగా ఉండకూడదు. **3.** బట్టలు లోపల శరీరాన్ని చూడగలిగేలా పారదర్శకంగా ఉండకూడదు. **4.** ఆకర్షణీయమైన దుస్తులను ధరించకూడదు. **5.** ఒక వ్యక్తి వ్యతిరేక లింగానికి చెందిన వస్త్రాన్ని ధరించకూడదు. **6.** అవిశ్వాసిని పోలిన బట్టలు ధరించకూడదు.

- హిజాబ్ కేవలం వస్త్రాలకే పరిమితం కాదు. నడక, మాట, చూపు, ప్రవర్తనకు కూడా వర్తిస్తుంది. మొత్తం కప్పుకుంటే అది **నాగరికత**. కానీ అన్నీ విప్పుకుంటే అది దిగజారుతున్న సమాజానికి నిదర్శనం.

**సమాజంలో వినయాన్ని, పవిత్రతను కాపాడటానికి వచ్చిన సంపూర్ణ మార్గదర్శకత్వం ఇస్లాం !**

ఇస్లాం మరియు హిందూ మతాలలో ఇంకా చాలా పోలికలు ఉన్నాయి.



- **నాన్ వెజ్ అనుమతించడం**

"తినదగిన జంతువుల మాంసం తినడం పాపం కాదు, ఎందుకంటే దేవుడు తినేవాటిని మరియు తినదగిన వాటిని రెండింటినీ సృష్టించాడు" *(మను ధర్మశాస్త్రం 9 : 235)*

"ఒక బ్రాహ్మణుడు 'శ్రద్ధ' సందర్భంగా అతనికి సమర్పించిన మాంసాన్ని తినడానికి నిరాకరిస్తే అతడు **నరకానికి** వెళ్తాడు." *(వశిష్ఠ ధర్మసూత్రం 11 : 34)*

"ఆడపిల్లల పెండ్లి సందర్భంగా ఎద్దులు, ఆవులను వధిస్తారు" *(ఋగ్వేదం 10 : 85 : 13)*

- *స్వామి వివేకానంద యొక్క పూర్తి రచనలు 3 : 5 : 36* లో ఆయన ఇలా అన్నారు

"ప్రాచీన హిందూ ఆచారాల ప్రకారం, గొడ్డు మాంసం తినని వ్యక్తి మంచి హిందువు కాలేడని తెలిస్తే మీరు ఆశ్చర్యపోతారు ! "

ఇలా హిందూ గ్రంధాలు మాంసాహారం తినడానికి అనుమతించినప్పటికీ, జైనమతం వంటి ఇతర మతాలచే ప్రభావితమైనందున చాలా మంది హిందువులు శాఖాహార విధానాన్ని అవలంబించారు.

ఇస్లాంలో మాంసం తినడం తప్పనిసరి కాదు. ప్రవక్త (అ) ఎక్కువ శాతం శాఖాహారమే తిన్నారు !

- **మద్యపాన నిషేధం**



"పూజారిని చంపడం, మద్యం సేవించడం, దొంగతనం చేయడం . . . (ఈ చర్యలకు పాల్పడే వారితో) సహవాసం చేయడం పెద్ద నేరాలు." *(మను ధర్మశాస్త్రం 9 : 235)*

"ఈ దౌర్భాగ్యులతో - ఎవరూ భోజనం చేయకూడదు, వీరి కోసం బలి అర్పించకూడదు, ఎవరికీ చదువు వినిపించకూడదు, ఎవరూ వీరిని వివాహం చేసుకోకూడదు..." *(మను ధర్మశాస్త్రం 9 : 238)*

**% వడ్డీ నిషేధం**

"వడ్డీ వ్యాపారి యొక్క అన్నం మలంతో సమానం." *(మను ధర్మశాస్త్రం 9 : 220)*



- **అదృష్టం / సోది చెప్పటం నిషేధం**

"లంచం తీసుకునేవారు, మోసగాళ్లు, జూదగాళ్లు; అదృష్టాన్ని ప్రకటించడం ద్వారా జీవించే వారు, మాటలతో మోసగించేవారు మరియు అదృష్టాన్ని చెప్పేవారు; . . . రాజు వీరిని వారి బలాన్ని బట్టి మరియు నేరాన్ని బట్టి సరిగ్గా శిక్షించాలి." *(మను ధర్మశాస్త్రం 9 : 258-262)*






- **మరి మక్కా లోని కాబా ఏంటి?**

ప్రతి ముస్లిం భూమి మధ్యలో ఉన్న మక్కా నగరంలోని కాబా దిశలో ప్రార్థిస్తారు. ఇది ఒక దిక్సూచియే కానీ కాబా గృహాన్ని ఎవరూ ఆరాధించరు ! ప్రవక్త అబ్రాహాము (అ) నిర్మించారు కాబట్టి గౌరవిస్తారు.

# పునర్జన్మ –> స్వర్గం / నరకం

"పునర్జన్మ" అంటే జనన మరణ చక్రం కాదు. ఆ సిద్ధాంతం వేదాలలో ఎక్కడా ప్రస్తావించబడలేదు ! సంస్కృతంలో 'పునర్' లేదా 'పునా' అంటే 'తదుపరిసారి' లేదా 'మళ్లీ' అని. జన్మ అంటే 'జీవితం' అని. కాబట్టి 'పునర్జన్మ' అంటే 'తరువాతి జీవితం' లేదా 'ఇకపై జీవితం' అని కాని భూమిపై మళ్లీ జీవం పోసుకోవడం కాదు. మరి ఆ మరణానంతర జీవితం శాశ్వతంగా ఎల్లప్పుడూ కలకాలం ఉంటుంది. కాబట్టి పునర్జన్మ ఆయితే స్వర్గం అవుతుంది లేదా నరకం అవుతుంది.

---

*** కాబట్టి సృష్టికర్త ఒక్కడినే ఆరాధించి, తాను పంపిన చివరి ప్రవక్తను విశ్వసిస్తే మరణానంతరం ఉండే శాశ్వత జీవితం సుఖసంతోషాల స్వర్గం అవుతుంది.**

- ***కఠోపనిషద్ 1 : 1 : 12*** లో ఇలా



***"స్వర్గలోకేనా భయం కించ నాస్తి నతత్రత్వం నజరయా***
***బిభేతి ఉభేతీర్త్వా సనాయ పిపాసే శోఖాదిగో మోడతే స్వర్గ లోకే"***

అంటే "స్వర్గ లోకంలో ఆకలి దప్పికలు లేవు, జనన మరణాలు లేవు, వృధాప్యం లేదు, మనిషి ఏది కోరుకుంటే అది వారికి లభిస్తుంది. అదే స్వర్గం."

- స్వర్గంలో అత్యంత విలువైన వరం – మన సృష్టికర్త అల్లాహ్‌ను స్వయంగా చూడగలగటం.

---

*** కానీ ఈ సత్య సందేశాన్ని తిరస్కరిస్తే మరణానంతర జీవితం నరకం అవుతుంది.**

- *గరుడపురాణం, శ్రీమద్భాగవతం* లో ఏతప్పుకు ఏ శిక్ష విదించాలో స్పష్టంగా చెప్పడం జరిగింది.

ఇస్లాంలో అతి ఘోర పాపం **షిర్క్**, సందేశం అర్ధమైన తర్వాత కూడా ఈ పాప స్థితిలో చనిపోతే అల్లాహ్ వారిని ఎప్పటికీ క్షమించరు. **బహు దేవతారాధకులు** (దైవంతో వేరే వాటిని కలిపి ఆరాధించువారు), **విగ్రహారాధకులు, దైవ తిరస్కారులు,** మొదలగువారు ... వీరు **నరకవాసులు.**



- ***ఖుర్‌ఆన్ 22 : 19 - 22*** లో శాశ్వత **నరకాగ్ని** గురించి హెచ్చరిస్తూ ఇలా

"కనుక సత్యాన్ని తిరస్కరించినవారి కొరకు **అగ్నితో చేసిన వస్త్రాలు** కుట్టించబడతాయి. వారి **తలలపై సలసలా మరిగే నీరు** కుమ్మరించబడుతుంది."

---



కాబట్టి, **తాత్కాలికమైన భూమి మీద జీవితంలో** మరియు **శాశ్వతమైన మరణానంతర జీవితంలో సాఫల్యం చెందటానికి ఇస్లాం కావాలి.**

# స్వీకరించి ఇస్లాం లోకి తిరిగి రావడానికి

- ***అల్లాహ్*** *(సృష్టికర్త)* ఇలా అన్నారు ***(సహీహ్ ముస్లిం 2865)***

"నేను నా సేవకులను సరైన మతంలో సృష్టించాను, కాని దెయ్యాలు వారిని తప్పుదారి పట్టించాయి".

- ***ప్రవక్త ముహమ్మద్*** *(అ)* ఇలా అన్నారు ***(సహీహ్ ముస్లిం 2659a)***

"ప్రతీ బిడ్డ **'ఇస్లాం'** (ఏకేశ్వరునికి సమర్పణ, విధేయత) యొక్క సహజ స్థితిలో పుడతాడు. కానీ అప్పుడు అతని తల్లిదండ్రులు అతనిని యూదుడు, క్రైస్తవుడు లేదా అగ్నిని పూజించే వాడిగా చేస్తారు."

- **ఇస్లాం ఉయ్యాల నుండి సమాధి వరకు, జీవితంలోని అన్ని అంశాలకు పూర్తి నియమావళి.**





మీడియా, కొంతమంది చెడ్డ వ్యక్తుల కారణంగా ఇస్లాం గురించి ఇంకా చాలా అపోహలున్నాయి. ఇంకొంతమంది ముస్లింలకి జ్ఞానం, అవగాహన లేనందున, వారి ప్రవర్తనలన్నీ ఇస్లాంతో ముడిపెట్టలేం.

- కాబట్టి మీరు ముందస్తు ఆలోచనలు లేకుండా పరిశోధిస్తే (దైవ చిత్తముతో) మీరే అంగీకరిస్తారు :

**ఇస్లాం ప్రపంచంలోనే అత్యంత అందమైన, శాంతియుతమైన,**

**మేధోపరమైన, వాస్తవికమైన, స్వచ్ఛమైన, నైతిక మతం.**

- ఇస్లాం ప్రపంచంలో అత్యంత వేగంగా పెరుగుతున్న మతం.

ప్రపంచ జనాభాలో ~ **25%** ముస్లింలు. నలుగురిలో ఒకరు ముస్లిం !



- ఒక **ముస్లిం** (ఏకేశ్వరునికి సమర్పించేవారు) ఈ **ఆరింటిని నమ్మాలి :**

**1.** ఒక్క దేవుడే ఉన్నాడని **2.** దేవదూతలని **3.** పవిత్ర గ్రంథాలని **4.** ప్రవక్తలని **5.** తీర్పు రోజు, మరణానంతర జీవితాన్ని **6.** విధి రాతని, విధి యొక్క మంచి చెడు రెండూనూ నమ్మాలి.

- **ఇస్లాంను స్వీకరించాలంటే** ఈ కింద ఉన్న **4** వాక్యాలు దృఢ నమ్మకంతో విశ్వసించి పలకాలి :

**"అష్ హదు అల్-లా ఇలాహఇల్లల్లాహ్,**

**వఅష్ హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహూ"**

"నేను సాక్ష్యమిస్తున్నాను, ఎవ్వరూ అర్హులు కారు ఆరాధనకు అల్లాహ్ తప్పితే,

నేను సాక్ష్యమిస్తున్నాను, ముహమ్మద్ అల్లాహ్ సేవకుడు మరియు సందేశహరుడు."

- ***ఖుర్ఆన్ 5 : 92*** లో ఎవ్వరైనా ఈ సందేశం ఇవ్వటం మాత్రమే చెయ్యగలరు అని ఇలా



"ప్రవక్తా ! (ఇంత నచ్చజెప్పినా) వీరు విముఖులై పోతే (పోని),

**నీ కర్తవ్యమల్లా సందేశాన్ని స్పష్టంగా అందజేయటం వరకే."**

- ***ఖుర్ఆన్ 28 : 56*** లో మార్గదర్శకత్వం చూపించగలిగేది దేవుడు ఒక్కడే అని ఇలా



"ప్రవక్తా ! నీవు కోరిన వారికల్లా సన్మార్గం చూపలేవు.

**దేవుడే తాను కోరిన వారికి సన్మార్గం చూపుతాడు.**

మార్గదర్శకత్వం పొందగలవారెవరో ఆయనకే బాగా తెలుసు."

- ***ఖుర్ఆన్ 5 : 3*** లో అల్లాహ్ (సృష్టికర్త) తాను ఎంచుకున్న ధర్మం ఇస్లాం అని ఇలా

"ఈ రోజు నేను మీ కోసం మీ ధర్మాన్ని పరిపూర్ణం చేసాను. మీ మీద నా కృపను, అనుగ్రహాన్ని పూర్తి చేసాను మరియు మీ కోసం (ఏకేశ్వరునికి సమర్పణ, విధేయత, పూర్తి భక్తి) **ఇస్లాంను మీ జీవన ధర్మంగా ఎంచుకున్నాను."**

- ***ఖుర్ఆన్ 2 : 256*** లో ఇలా

**"ధర్మ స్వీకరణలో ఎలాంటి బలవంతం, బలప్రయోగం లేదు. సత్యం అసత్యం నుండి స్పష్టంగా వేరుచేయబడింది.** కనుక ఇకనుండి మిథ్యా (అబద్ధ) దైవాలను నిరాకరించి, అల్లాహ్‌ను విశ్వసించినవాడు గట్టి ఆధారాన్ని పట్టుకున్నాడు. అది తెగిపోనిది. దేవుడు అంతా వినేవాడు, అన్నీ తెలిసినవాడు."

- ***ఖుర్ఆన్ 41 : 53 - 54*** లో అల్లాహ్ (సృష్టికర్త) ఇలా అంటున్నారు

"త్వరలోనే మేము వారికి మా సంకేతాలు చూపిస్తాము. జగతిలోనూ, స్వయంగా వారిలోనూ ! **చివరికి ఇదే సత్యమన్న విషయం వారికి స్పష్టమయ్యే వరకు.** నీ ప్రభువు ప్రతిదానికీ సాక్షిగా ఉన్నాడనే విషయం సరిపోదా? "



- చివరిగా ***ఖుర్ఆన్ 51 : 56 - 58*** లో అల్లాహ్ (సృష్టికర్త) ఇలా అంటున్నారు

"నేను జిన్నుల్ని, **మానవుల్ని సృష్టించినది కేవలం నన్ను ఆరాధించటానికే.** నేను వారి నుండి ఉపాధి కోరడంలేదు. నాకు అన్నం పెట్టమని అడగడం లేదు. దేవుడే అందరి ఉపాధిప్రదాత. ఆయన మహా బలశాలి, అద్భుత శక్తిసంపన్నుడు."

- చాలా మంది గ్రంథాలు చదువుతారు కానీ వాటిని అర్థం చేసుకోరు – ***ఋగ్వేదం 10 : 71 : 4***

*"కొందరు పదాలను చూస్తారు కానీ నిజానికి వాటిని చూడరు; ఇంకొకరు ఈ మాటలు వినొచ్చు, కానీ నిజానికి వాటిని వినరు."* (మనం ఇలా అవ్వకూడదు)

---

ఈ పుస్తకంతో మీరు మన సృష్టికర్తను, ఆయన మనల్ని సృష్టించిన ఉద్దేశాన్ని, భూమ్మీద మనం జీవించాల్సిన విధానాన్ని తెలుసుకున్నారని ఆశిస్తున్నాను. అల్లాహ్ మీకు ఋజు మార్గం చూపాలని ప్రార్థిస్తున్నాను. మీ అమూల్యమైన జీవితంలో సమయం ఇచ్చినందుకు **కృతజ్ఞతలు**. ఇందులో ఉన్న మంచి అంతా అల్లాహ్ నుండి, చెడు ఏదివున్నా అది నా నుండి. ఏదేంటో అల్లాహ్‌కు బాగా తెలుసు.

# సృష్టికర్త > సృష్టి

ఒక్క సృష్టికర్త తప్ప | ప్రతిదీ అతను సృష్టించిన సృష్టి. ఆ సృష్టికర్త ఒక్కడే మన ఆరాధనలకు అర్హుడు.

~~విగ్రహాలు, బొమ్మలు, ఫోటోలు, సూర్య చంద్రులు, గ్రహాలు, రాళ్ళు, గాలి, నీరు, అగ్ని, భూమి, ఆకాశం, పాములు, ఆవులు, జంతువులు, బాబాలు, తాయెత్తులు, నిమ్మకాయలు, గుమ్మడికాయలు, కూరగాయలు, దర్గాలు, సమాధులు, ఆత్మలు, జిన్నులు, ప్రవక్తలు, మనుషులు, దేవదూతలు~~

సర్వలోకాలకు ప్రభువైన సృష్టికర్త అల్లాహ్‌కు సకల విధాల ప్రశంసలు, కృతజ్ఞతలు.

---

మరింత సమాచారం కోసం సంప్రదించండి :

**info@truepurposeoflife.org**

మరిన్ని ఖుర్ఆన్ అద్భుతాలను తెలుసుకోవాలంటే

**miracles-of-quran.com**

**ఉచిత** ఖుర్ఆన్, ఈ పుస్తకం **PDF**, ఇస్లాం, హిందూ, క్రైస్తవ మతాలు తెలుసుకోండి :

**DOWNLOAD FREE QUR'AN, PDF OF THIS BOOK &**
**LEARN TRUE HINDUISM, CHRISTIANITY, ISLAM (TEL, ENG)**

# truepurposeoflife.org

# వివిధ మత వర్గాలు




- ప్రపంచ జనాభాలో **ఎక్కువ** శాతం సున్నీ **ముస్లింలే !** 2వ స్థానంలోని రోమన్ కేథలిక్ క్రైస్తవుల కన్నా ముస్లింలు ~ 5.5 శాతం ఎక్కువ. వర్గాలు ఉన్నప్పటికి, ముస్లిం వర్గాలకి క్రైస్తవ వర్గాలకి తేడా ఉంది.
- రాజకీయ తేడాలు ఉన్నప్పటికి ప్రపంచవ్యాప్తంగా **ముస్లింలందరూ** అరబ్బీ భాషలో **పూర్తిగా భద్రపరిచబడిన ఒకే ఖుర్ఆన్** గ్రంథాన్ని చదువుతారు. దేవుడి విషయంలో సృష్టికర్త అల్లాహ్ ఒక్కడిని తప్ప మరెవరినైనా ఆరాధించినా, ఖుర్ఆన్ మరియు సున్నా (ప్రవక్త మాటలు, పద్ధతులు) తిరస్కరించినా వారు ఇస్లాం మతంలోనుంచి తప్పుకున్నట్టే. వారు నిజమైన ముస్లింల కిందకి రారు.
- **కానీ క్రైస్తవులలో** ఒక్కో వర్గం ఒక్కో బైబిల్ అనుసరిస్తుంది, మోక్షానికి ఒక్కో నిర్వచనం ఉంటుంది. కాథోలిక్ క్రైస్తవులు ప్రవక్త యేసు (అ) తల్లి మేరీని "దేవుడి తల్లి !" అని యేసుతో పాటు ఆమెను కూడా దేవుడితో కలిపి ఆరాధిస్తారు. ఇంకా రోమన్ కేథలిక్ క్రైస్తవుల బైబిల్ లో 73 పుస్తకాలు, ప్రొటెస్టెంట్ క్రైస్తవుల బైబిల్ లో 66, ఈస్టర్న్ ఆర్థోడాక్స్ క్రైస్తవుల బైబిల్ లో 78 పుస్తకాలు ఉంటాయి. బైబిల్ కి చాలా వెర్షన్లు కూడా ఉన్నాయి. ఉదాహరణకి : మరింత ప్రాచీన రాతప్రతుల ఆధారంగా అనువదించబడిన 1952 రివైజ్డ్ స్టాండర్డ్ వెర్షన్ (RSV) పాత 1611 కింగ్ జేమ్స్ వెర్షన్ (KJV) తప్పులను సరిదిద్దుతుంది.

**మానవులందరికీ** { **ఒకే**
- ఆరాధ్య దైవం
- దైవ గ్రంథం
- సనాతన ధర్మం
- ప్రార్థనా దిక్కు
- ప్రార్థనా భాష

} విశ్వ శాంతి ధర్మం **ఇస్లాం**

------- *THE END* -------




ISLAM INFORMATION PEACE CENTER, KHAMMAM

*FREE*